Reg. No. 757.

# అభినవసరస్వతి

యామునాక మాసపత్రిక

అష్టావధాని జనపాటి పట్టాభిరామశాస్త్రిచే
ప్రచురింపఁబడుచున్నది.
గుంటూరు.

| | | |
|---|---|---|
| సంపుటము 14 | 1922 సం॥ మే, జూన్ | 2, 3 సంచికలు |

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు.

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0
పోషకులకు రు 10 0 0 చందాదారులకు 3 0 0

చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur,
and published at Guntur, by the Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry

# అభినవసరస్వతి.

సంపుటము ౧౪ { గుంటూరు, దుందుభి సం॥ వైశాఖ జ్యేష్ఠములు. } సంచిక ౨, 3

## పుష్పగిరిస్వాములవారి నిర్వాణము

శ్లో॥ అంభోధి స్థ్సలతాం స్థలం జలధితాం ధూళీలవ శ్శైలతాం
మేరు ర్మృత్కణతాం తృణం కులిశతాం వజ్రం తృణప్రాయతాం

## ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరిస్వాముల వారు.

2 శ్రీ శ్రీ రాజా గద్వాలసంస్థానాధీశ్వర సీతారామ భూపాల బలవంత్ బహద్దరువారు, గద్వాలసంస్థానము.

## పోషకులు

1 రామసింగుగారు, వెల్లుట్ల పాపురపు సంస్థానము మేనేజరు, వెల్లుట్ల.
2 జాలూరి వెంకటరత్నంగారు, వకీలు, గుంటూరు.
3 ఎనమండ్ర లక్ష్మీనరసింహముగారు, మర్చెంటు, బెజవాడ.
4 మోతె గంగరాజుగారు-విస్సన్నపేట గుండేపల్లి యెస్టేటుజమీందారు.

---

5 జాగర్లమూడి కుప్పస్వామి నాయుడుగారు, కారంచేడు.
6 అల్లాడి లక్ష్మణరావుగారు, కరణం, జంగపల్లి.
7 రాయవరపు గవర్రాజుగారు, మూలపేట.
8 గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానికొంకూరు.
9 కంచుకూరు లక్ష్మీప్రసాదరావు బహద్దూరు జమీందారుగారు, ఉర్లాం.
10 కోతా సూర్యనారాయణరావుగారు, మర్చెంటు బెజవాడ.
11 శీతల్ సింగుగారు, మర్చెంటు, సాగవరం.

## సహాయులు.

1 పట్వారి నారాయణరావుగారు, క్షీరసాగరము.
2 పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు, బెజవాడ.
3 జంగంకోట రాజారావుగారు, ఏషియాటిక కమర్షల్ ఎష్యూరెన్సుకంపెని సెక్రెటరి.
4 కొండూరు నారాయణరావుగారు మర్చెంటు, ఏలూరు.
5 చారబుడ్డి రత్నారెడ్డిగారు, న్యాలపోగుల.
6 వెల్లుట్ల నరసింహారావుగారు, జోనగా
7 ములుకుట్ల నరసింహావధాని గారు. దేవామృతరసం ప్రొప్రయిటరు కరూరు
8 గోటేటి వేణుగోపాలరావుగారు, పోలీసుసబుయిన్ స్పెక్టరు, గుంటూరు.

---

9 కొలమకన్ని శోభనాద్రిరావుగారు, అడ్డూరు సివారు.
10 రావిప్రోలు రాఘవదీక్షితులుగారు, పోలీసుసబ్ యినస్పెక్టరు, కార్వేటినగరము
11 పిల్లలమర్రి సోమయాజులుగారు, తహసీలుదారు, ఒంగోలు.
12 వావిళ్ల వెంకటేశశాస్త్రిగారు, చెన్నపట్టణం.
13 కారుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట.
14 మెదకు శివజీరావు దేశముఖుగారు, నల్లబల్లి.
15 వెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, వెల్లుట్ల.
16 శ్రీ శ్రీ లక్ష్మీనరసింహస్వామివారు, యాదగిరి.
17 తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల.
19 లింగా వెంకటరెడ్డి దేశముఖుగారు కుందవరము.
19 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోజర్లంపాడు.
20 నారాయణరావు గారు, గాజావుపల్లె.

మునకుఁ జేరిన మురికినాటి బ్రాహ్మణుఁడు. బాల్యమున్న దలిదండ్రులచే
రాజకీయకలాపారమునకై ప్రొద్దుటూరిలో నుంపఁబడి చదువుచుండ
నృసింహభారతీస్వామి రుజాగ్రస్తుఁడై దేహమును విడువఁదగినసమయ
మరుదెంచుట యూహించి పూర్వాశ్రమీయ భ్రాతృపుత్రాదులు కొం
దఱు సమీపస్థులై యుండి పీఠాధ్యక్షత నభిలషించుచున్నను దదధికార
మువహించి నిర్వహించుకొనఁదగిన సల్లక్షణములు వారియందుఁ గనఁబడ
మిని దూరస్థుఁడైన యీపిల్లవానిం బిలిపించుకొని యాశ్రమస్వీకార
మున కంగీకరించుమని కోరుటయు సన్న్యాసాశ్రమమున నిష్కళంకచరి
త్రుఁడై మనఁగలుగుట కష్టసాధ్యమని యందుల కంగీకరింపఁడయ్యె.

అయినను నతఁడే యాస్థానమున కర్హుఁడని యాత్మకు నిశ్చయము
కలుగుటం జేసి యనేకవిధంబులఁ బ్రబోధించి యందుల కంగీకరింపఁ జేసి
మహామంత్రం బనుగ్రహించి యానృసింహభారతీస్వాములవారు సమా
ధిగతుండగుటయుఁ బ్రాయమువచ్చునంతవఱకును బ్రభుత్వమువారే పరి
పాలకులు కావలయుటవలనఁ బ్రొద్దుటూరు డిస్ట్రిక్టుమున్సిఫ్ కోర్టుప్లీడ రొక
రీపీఠమునకు మానేజరుగా నేర్పఱుపఁబడియె. ఆయన దూరదర్శియగు
కతంబునఁ బీఠాధిపతులగు యతులకు విద్వత్త యత్యావశ్యకమని యూ
హించి వెంటనే కర్నూలు రాజకీయకలాపారశాలలో సంస్కృతోపాధ్యా
యులుగానుండిన కరివెన సదాశివశాస్త్రిగారిని బిలిపించి నెలకు ౫౦ రూ
పాయల వేతన మేర్పఱచి బాలస్వాములచేఁ బఠింపఁ జేసెను. అంతస్వా
మి గ్రమముగా రామశబ్దము మొదలు కౌముద్యంతము తత్సమీపమునఁ
బఠించుటయు మానేజరు తావత్పర్యంతమును దగురీతిని దేశసంచరణం బొ
నరించి యదివఱకున్న ఋణములుకూడఁ గొంతవఱకుఁ దీర్చి పీఠము
విద్యాశంకరభారతీస్వాముల యధీనముఁ జేసి వెడలిపోయెను; తరువా
త మల్లాది యాంజనేయశాస్త్రిగారివద్ద న్యాయశాస్త్ర మారంభించి
సామాన్యనిరుక్తిపర్యంతము సత్వరంబుగఁ జదివి వేదాంతశాస్త్రంబున

విశేషపరిశ్రమముఁ జేసి విద్యాశంకరభారతీస్వామి విశ్రుతయశము గడిం పంగలిగెను. భాస్కరోదయమగునప్పటికే ప్రాతరాహ్నికము నిర్వర్తించి భాష్యపారాయణమునకుఁ గడంగెడి యీయతిశేఖరు నెంతయేని సన్నుతింపనగు. మఱచియైనను స్త్రీవ్యక్తిని గన్నెత్తిచూ[illegible] యీజితేంద్రియు మహాత్త్వ మేమని వర్ణింపఁగలము. యతులకుండఁదగిన యఖిలసద్గుణములు నయ్యాచార్యునొద్ద నావాస మొనరించెననుట స్వభావోక్తి. గజాద్యారోహణమును కిరీటాదిధారణమును నిత్యాదికములుకొన్ని యతిధర్మములు కావని కొందఱాక్షేపింతురు. నిజమునకవి యతిసామాన్యమునకు ధర్మములు కాకున్నను పీఠాధిపతులకుఁ బరంపరాగతము లగుచున్నయవి.

ఉత్తమధర్మములన్నియు నుత్సన్నములగు నీకాలముననే కాక చాల కాలమునుండియుఁ బీఠాధిపతులు పైయాచార మనుష్ఠించుటకుఁ ప్రబలకారణ మేదియో యొకటి యుండితీరవలె, అట్లుండకున్న విధిదూరములగు నిట్టిపనుల సహించి మన మూరకున్నను మనపూర్వులూరకుండరు. లక్ష్మీసరస్వతీవర ప్రాప్తమై విద్యారణ్యులనాఁటినుండియే యీయాచారము వచ్చుచున్నట్లు కొన్నిగ్రంథములవలనఁ గనఁబడుచున్నది. వాని ప్రామాణ్యము మున్నగు నంశములు చర్చించుట కిది యవసరముగామిని విడిచి ప్రకృత మనుసరింతును. ప్రకృతముగతించిన స్వాములవారు ప్రథమమునుండియుఁ బ్రభుత్వమువారి పోషణక్రింద నుండినవారగుటవలనఁ బ్రాయమువచ్చిన తర్వాతఁ దమధర్మములఁ దాము చక్కఁగా నెఱవేర్చుచుఁ దమవ్యవహారమునుగూడఁ దాము చక్కఁగా విచారించుకొనఁగలిగిరి. అఖిలమును నమాత్యులే నిర్వర్తించుచున్నను వారిమీఁదితనిఖి తాముచేయుచు దానాదానములయందును నిగ్రహానుగ్రహములయందును సర్వస్వతంత్రులై యుండుచువచ్చిరి. అందువలననే యాస్థానసేవకులకందఱికిని నవ్వారిపేరన్న సింహస్వప్నమైయుండెను. సత్ప్రవర్తనగలవారి ననుగ్రహించుటకును దుష్టవర్తనగలవారి దూరగు

లఁజేయుటకును వెనుదీయరైరి. జాగ్రత్వమనుమాట స్వామివారి చెవులఁ బడరానిదయ్యె. శ్రీ వారికి మైనరుతీరునాఁటికి విద్యాగురువులగు కరివెన సదాశివశాస్త్రిగారు వేయారులిచ్చి విశేషము సంతోషపెట్టఁబడియు నొక యాఘుమానసములైనను నమాత్యపీఠ మలంకరింపఁజేయుఁడని వేడి సమీపించి పాదాల కనుగ్రహించిరి. అట్లనుగ్రహింపఁబడి సర్వాధికారము లేకో సంస్థానమునఁ బ్రవర్తించుచో నాశాస్త్రిగారిపై నిజమో యబద్ధమో పూర్వోక్తదోష మారోపింపఁబడుటయు విద్యాగురువులైనను స్వస్థానంబున నవ్వారియునికి స్వాములవారి కిష్టముకాకపోయెను. కాకున్నను దమనోటిమీఁదుగా వెడలిపొండని చెప్పలేక వారి కేదో పనికలిగి స్వగ్రామమునకుఁ బోయినప్పుడు మరల నీస్థానమునకు రానవసరములేదనియు వచ్చిన మీపూర్వగౌరవము మీ కుండదనియు వ్రాయించిరి. అట్టి తీక్ష్ణవ్రతు లన్యు లాదోషమున కొడిగట్టిన నెట్లుసహింతురు ? వాని నెట్లు స్వసాన్నిధ్యమున నుంచికొందురు ? అట్టివారి యెడల నడచుచునే యుందురు.

భూములవలనవచ్చు నాదాయమే ౫౦,౦౦౦ రూపాయలవఱకు గలిగియున్న యీపీఠమునఁ జంద్రమౌళీశ్వరాది దేవతాసంబంధి కలధౌతభూషణాదులును గోశమును గాపాడుటకుఁ దగిన పరివార ముండవలయుటవలనఁ గొంద ఱాయుధపాణు లుంచఁబడియుండిరి. అందుఁ గొందఱు క్షత్రియులఁట. వారిలో గురవరాజను నొక్కఁడుండెనఁట. పరంపరాగతులై యిట్టివారు కొంద ఱాపీఠంబున నుండుచుండిరి. గురవరాజనువాఁడు చిఱుతప్రాయపువాఁడై యౌవనోద్రేక మావహించి వర్తించుచుండెఁగాఁబోలు. స్వాములవారికో లేక మఱియొకరికో చెవిలోఁబోటులేచుటయుఁ దన్నివారణార్థమై తరుణీస్తన్యము కావలసి పై గురవరాజను బోయి యెచ్చటేని యడిగి తెమ్మని యం దెవరో యాజ్ఞయిచ్చిరఁట. అంత వాఁ డొక కాఁపుటవద్దకే యడుగుసమయమున కాపె శిశు

పునకు స్తన్యమిచ్చుచుండఁగొంచెము సేపుండుమనెనఁట. రాజంతవఱకు కాఁగఁలేక రెండవ స్తన్యమును నేను గ్రహింతుననె నఁట. అంతవఱ యున్వార్త భర్తకు జెప్పించుటయుఁ గ్రమముగా సద్గురుశ్రీవారి చెప్పులవఱకుఁ బోవఁగలిగెనఁట. అప్పుడు వారు లిట్టిదుర్మార్గుఁడుస్వదాస్థానమున నుండఁదగఁడు కావున సచివులు వానికి రావలసిన జీతము లెక్కచూచి యిచ్చివేసి వెడలఁగొట్టుఁడని నిర్దనముగా నాజ్ఞ యిచ్చెనట. మంత్రులట్లు చేసిరఁట. అట్లు నిష్కాసితుఁడై వాఁడు వెంటనే వెడలిపోక మరల నాలుగైదు దినములాయూర నుండెనఁట. అట్లుండి యొకనాఁడు రాత్రి మూఁడవజామున వేసవికాలమగుట బయలునఁ దడకలనడుమ మడతమంచముపైఁ బరుండి నిద్రించుచున్న స్వామిని జంపు దురూహతోఁ గత్తిబట్టుకొని పోవుటయుఁ బహారాబన్ద్రలాతు వాని కష్టమువచ్చి యాకత్తిచేఁ బొడువఁబడి క్రిందఁ గూలెనఁట. వీజనద్రోహియైన మఱియొకఁ డద్ది చూచి పాఱిపోవుటయు గురవరాజు గురుని పర్యంకమునఁ గూరుచుండి కొట్టిలేపి యట్టి కసిదీఱ ననేకపర్యాయము లసిధారచే నంగమఱవఱలు గావించెనఁట. అక్కటా! దుర్దైవ మెంతపనిగావింపఁజేసె. ఎట్టిసద్గుణరాశి కెంతటి సుకుమారికెట్టి దుర్మరణము ప్రాప్తించె. ఈఘోరకార్య మేజన్మపుఁ గర్మానుభవమైయుండెడిని. అయ్యయ్యో! ఎంతమాట వినవలసివచ్చె.

“గురులు శిష్యులతోడ గుద్దులాడఁగలేక మాసముద్రవహించి మనఁగఁజూతు”రన్న స్కాందమహాపురాణాంతర్గత నాగరఖండవాక్యమును సార్థకముఁ జేయుకాలము సమీపగతమగుటవలన స్వాములవారు జనపదసంచారమును సంకుచితముఁజేయు సంకల్పముతో నేచాలవఱకు బూర్వమున్న యగ్రహారములుకాక భూముల నార్జింపఁగలిగి కొలఁది కాలములో సంచారము చేయకున్నను జంద్రమౌళీశ్వర సేవాసత్కారములు చక్కగా సంవత్సరముపొడుగునను జరుపుటకుఁ జాలినంత యాదాయమేర్పఱచు దీక్షతో నేయుండిరి. అయినను నాలుగైదు సంవత్సరములనుండి

జేసీమబాధ లధికమగుచు జనులు మనుటయే కష్టముగానుండుటకుఁ దింతిల్లుచు సంచారమును జాలించి శీతమునకు నిత్యనివాసమైన పుష్పగిరి లోనే నివాసము చేయుచుండిరి. ౭ యేనుఁగులు ౮౮ పెద్దబండ్లు తగినపరి వారము నంతయుఁ గలసి ౮౦౦ జీవము లనుదినము నాస్థానధనముతో జీవింపవలె. అదిగాక చాతుర్మాస్య నవరాత్రాదివ్రతములు యథా శాస్త్ర మధికధనవ్యయముతో నిర్వర్తింపఁబడవలె. తాము యతులై నను సంస్థానమర్యాదానుసరణముగా పండితసత్కారాదులు సరిగా జరుగుచుండవలె. ఇట్టివ్యయములలో సంచారము సరిగా లేకయుండు నీ నాలుగై దుసంవత్సరములలో నదివఱ కార్జించియుంచిన ౧౦౦౦౦ రూప్యములు వ్యయమయి పోవలసివచ్చె. అట్లయినను నిక్కాలమున కేదో విపత్తువచ్చుటమదికిఁ గొంత పొడకట్టుటవలన సంచారమునకు బయలు వెడలుటకు సంకల్పింపకయే యుండిరి. ఋణముచేసి తినవలసివచ్చినదని సచివులు చాలఁ బ్రార్థించి బయలుదేరఁదీసిరి. క్రమముగా వచ్చుచు బెజవాడనుండి గుంతకంటకిఁబోవు రైలుమార్గములోఁ గంభమున కీవల భాగమున మార్కాపురమున కావలభాగమున నున్న తర్లుపాడను నూ రికిఁ జేరుటయు శ్రీవారి శరీరమున దద్దుపోసెను. అక్కారణముచే రానున్న యాపత్తదియే కాఁబోలునని యూహించి యారోగ్యముకలు గునంతవఱ కాయూరనే యుండ నిశ్చయించి యుండుటయుఁ గొనమొ దలు ముప్పదినలుబది వేలరూపాయల ఋణము చేయవలసివచ్చెను.

అట్టిసమయమున నిట్టిదుర్మరణము శ్రీవారికి సంప్రాప్తించుటయు నాకలకలము విని చుట్టుపట్లవారరుదెంచునప్పటి కాహంతకుఁ డంతః ప్రవిష్టుఁడై గొళ్ళెముపైచికొని యింకను దివానున్నుజంపెదను వారిని జంపెదను వీరిని జంపెదనని ప్రేలుచుండెనఁట. అట్టిపట్ల నాకస్మికముగా నైన యీకార్యమున కలమటఁ జెందుచు నమాత్యవరులగు బోయల కుంట సుబ్బనరసయ్యగారు ప్రభుత్వమువారికి రిపోర్టులంపఁబడి ఖావి

తవ్యమునుగూర్చి పర్యాలోచించి శంకరభారతీస్వాములవారు స్వపీఠము న శాస్త్రప్రకారము స్వశిష్యు నొకని స్థాపించి యేగదున్నను బెజ్జెండ్ల నుండి పీఠసన్నిధివసించుచు శ్రీవారికి ముఖ్యపరిచారకుఁడై సత్యశౌచ ములును శమదమములును జక్కఁగాఁ గలిగి సంసారమందలి విరక్తిచే సన్యాసమభిలషించుచుండియు స్వామివారి యుపేక్షచేతనే నిలిచియుండిన సన్నిధిశిష్యునిచేఁ దద్గురుపీఠ మలంకరింపఁజేసిరి. ఆయన వంగోలు తాలూకాలోని యొకయూరనుండు వెలనాటి బ్రాహ్మణుఁడు. గింజుపల్లి పున్నయ్యగారను తదాస్థానవేత్రధరుని కనిష్ఠుఁడు. జపతపంబులతోడను స్వామివారి సపర్యతోడను సర్వదా కాలముపుచ్చుచు సచ్చింతతోనుండు నైష్ఠిక బ్రహ్మచారి. ఈకాలమునందని స్పష్టగింపకున్నను స్వాముల వారాచక్రయ్యయను పేరి సద్బ్రహ్మచారినే స్వశిష్యుని జేసికొని స్వకీ యపీఠాధ్యక్షత నియ్యఁదలఁచియుండిరి. ఆసంకల్పమును హఠాత్తుగా సంభవించిన మరణసమయమున సహాత్ములతో వ్యక్తీకరించియుండ నోపు. శ్రీవారికి శ్రీయఃప్రాప్తియైనదివసము దుందుభిసంవత్సర వైశాఖ శుద్ధదశమీ స్థిరవారమునకు సరియగు క్రీస్తుశకము 1922వ సం॥ మే 6వ తేది. 7వ తేది సూర్యోదయమునఁ దద్గ్రామమునందు క్రైస్తవ మతబోధకుఁడువచ్చి జరిగినకార్యమునకుఁ జాలఁజింతించి హంతకునిబట్టు కొనఁ బ్రయత్నించుటయు నీవలకువెళ్లి రాక లోపలనుండు పీఠసంబంధ ములగు తుపాకు లనేకము ప్రేల్చి తుట్టతుదకుఁ దానే ప్రేల్చుకొనియును జావక మహాశ్రమమువీఁదఁ బట్టుపడియెను. అంత మార్కాపురము నుండి డివిజన్ మేజస్ట్రేటుగారును సబ్ మేజిస్ట్రేటుగారును గంభమునుండి డాక్టరుగారును వచ్చి చేయవలసినపరిశీలనచేసి యేకాదశిరాత్రి ౨ గంట లకు శ్రీవారి సమాధి కనుజ్ఞ యిచ్చిరి.

కుత్సితుఁడగు గురవరాజుచేత నెన్నియో పోట్లుపొడువఁబడి కలుషిత మైన గురువర్యుని కళేబరమును మఱింత ఛిన్నభిన్నముచేసి చెఱఁగొట్టి

కుండ సమాధిస్థముఁ జేయుటకుఁగా సమ్మతించిన డాక్టరుగారు మున్నగు రాజకీయోద్యోగు లెంతయు సంస్తవనీయులు. ఆకాలమున కరుదెంచినఁగా వనీసురపరిభృత్యానేక సహస్రజనులే కాక డిప్టీకలెక్టరు మున్నగు నున్నతోద్యోగులును జక్రయ్యగారను సన్నిధిశిష్యుని సన్న్యాసమునకును జగద్గురుపీఠాధిపత్యమునకును శంకరభారతీస్వామి సంకల్పానుగుణంబుగ సమ్మతించినందులకు సంస్తుత్యులు. ఇట్టి విపత్సమయమున నెడంద ధైర్యమువహించి కడుంగడు శీఘ్రకాలమునఁ బీఠ మరాజకముగాకుండ నిట్టియేర్పాటు చేయఁగలిగిన యేటూరి యప్పాశాస్త్రిగారును బోయలకుంట సుబ్బనరసయ్యగారును స్తోత్రార్హులు. అట్టు లేకాదశినాఁడు రాత్రి ౧౧ గంటలకుఁ బ్రభుత్వమువారిచే బారలౌకికకృత్యకరణమున కనుజ్ఞయీయఁబడుటయు ద్వాదశీదినము సూర్యోదయమగువఱకు శంకరభారతీస్వామిని శంకరాలయములో సమాధిగతుం గావించిరి. ఆకారణంబున నాహరివాసరమున నందఱికిని నసంకల్పితముగా నుపవాసజాగరణములు లభించుటయు మఱునాఁడు చంద్రమౌళీశ్వరస్వామికిఁ బునస్సంప్రోక్షణాదిక మాచరించి యథావిధి పీఠమర్యాదలు నిర్వర్తింపఁబడియె. శంకరభారతీస్వామి సంకల్పానుగుణముగా జనసహస్రముల సమ్మతివహించి జగద్గురుపీఠమలంకరించిన స్వాములవారు విద్యానృసింహభారతీయను తురీయాశ్రమాభిధానముతో విరాజిల్లుచు గురుస్వాములవారికి యథాశాస్త్రముగా నారాయణబలి మొదలగు పారలౌకికకృత్యములు నిర్వర్తించి సక్రమముగా సంచారమున కుపక్రమించి గజ్జలకొండకు వేంచేసియున్నవారు. ఈసంవత్సరము చాతుర్మాస్యదీక్ష కంభముగ్రామములోను నవరాత్రిదీక్ష మార్కాపురములోను జరుగఁగలవు. అనాదిసిద్ధములైన యఖిలపీఠమర్యాదలతో నభినవవిద్యానరసింహస్వాములవా రాత్మీయ శిష్యజనులఁ బునీతులఁ జేయుచు నఖండయశ మార్జింపఁజేయుటకై యా చంద్రమౌళీశ్వరుఁ డభ్యర్థితుఁడు.

కం॥ అతఁడీసురవరుఁడగుగురు నవలోకనఁజేసి "యుగమహాత్మ్యము నాకున్
వివరింపు కింకస్వరూపములవి వానిప్రమాణ మెంత?" యని యడుగుటయున్ 878

కం॥ గురుఁడిట్టులనియె, "వినుమో పురుహూతా! యుగమహాత్మ్యము నీకున్ నే
నెఱిఁగింతుఁ దత్ప్రమాణము స్వరూపమును నవధరింపు వక్కాణింతున్, 879

వ॥ అష్టావింశతిసహస్రోత్తర సప్తదశలక్ష (౧౭౨౮౦౦౦) వర్ష పరిమితంబై కృతయుగంబు పొలుపారెడు, నందు జనార్దనుండు శుక్లవర్ణుండును ధర్మంబు చతుష్పాదంబును వసుంధర సుసంపూర్ణంబును నైయుండు మఱియును

కం॥ కామక్రోధవిరోధము లేమాత్రము లేక నిర్జితేంద్రియులగుచున్
శ్రమించుచుండ్రు కృతయుగభూమిజను ల్శాంతిపరతఁ బూర్ణాయువులై

తే॥ పంచతాళప్రమాణులు బహుశాస్త్రపాఠకులు నైన యాజను ల్పదియునాలు
వేలయేండ్లవఱకును బాలురగుచుఁ బరఁగుచుండుదు రోశచీప్రాణనాథ!

ఉ॥ ముప్పదియాఱువేలపరుము త్తరుణత్వముదాల్చి యాజనం
బప్పుడు వృద్ధభావమున నాస్పదమౌను బలానురారి! యి
ట్లప్పటివారలైన పరమాయువు లక్షశరత్తు, లద్దియుం
దప్పను గొంతమందిరొుదెఁ దద్యుగసత్త యదేమనన్ వలెన్ 883

కం॥ తద్యుగమునఁ బశుపక్షిమృగాద్యఖిలాత్మ్యల్పజంతులైనను దివిజ
ద్విద్వాంసత్త్వముగలవై హృద్యత దాదిత్యభాషచే మాటాడున్, 884

ఆ॥ ఆడుకొనుచునుండు నయ్యాదియుగమున ముంగిసయును భుజంగమును సుఖంబు,
ఎలుక పిల్లిమీఁద నెలమిం బరుండెడుఁ, గాకఘూకములును గలసితిరుగు, 885

ఉ॥ దున్నకవిత్తనం బుడమి తొయ్యలి వ్రీహియవాది సస్యసం
పన్నతఁగల్గి స్వాదుఫలభాగిరియయ్యెడుఁ, గల్పభూమిరు
ట్సన్నిభమౌచు నెల్లపుడు శాఖిచయంబు ఫలప్రసూనసం
ఛన్నతఁ గంటకంబులకు స్థానమొసంగకయుండు నయ్యెడన్, 886

కం॥ ఆవులు మధురక్షీరము లే వేళను వలసినన్ని యిచ్చుచునుండున్,
దేవాధీశ్వర! యగుఁజూమి కావలసినయంతవట్టు కమ్మనిఘృతమున్, 887

సీ॥ పతిహీనయగుచు వేషంకేజముఖియైన వెతనొంద దెన్నఁడుం గృతయుగమున,
సౌభాగ్యమెడలి యేసారంగనయనయు మతిఁ గుందదెన్నఁడుం గృతయుగమున,
గొడ్డురాలగుచు నేకుటిలకుంతలయును ధృతిఁదూలదెన్నఁడుం గృతయుగమున,
శీలంబుఁబాసి యేశృంగారవతియు నకీర్త్యగా దెన్నఁడుం గృతయుగమున,

## శ్రీ త్రమాసపతి కానుబంధము.

ఇక్కడకేఁ గృతయుగస్వరూపము ప్రకటీకృతము. ఇత్యాది గీర్వాణభాషయం దున్నందువలనఁ దద్భాషావిదులకే విదితమయ్యెడిని గాని యంతఱకును గానేరదు. కావున నీశ్లోకములయందలి యర్థమును విస్పష్టమొనరించెడు పద్యముల నీదిగువఁ బ్రచురింతును. ఒక్క కృతయుగస్వరూపమును దెలుపుపద్యములనే కాక యవశిష్టయుగత్రయస్వరూపబోధకములగు పద్యములఁగూడ నుదాహరింతును. చదువరులకుఁ బ్రామాణ్యబుద్ధి కలుగుటకయి ఋషిప్రోక్తములగు నీశ్లోకము లుదాహృతములు. మూలము నతిక్రమించకుండ నేతత్పురాణము నాచేతనే యాంధ్రీకృతం బగుచున్నయది. ఇం దనేక ధర్మరహస్యములు దెలుపఁబడియున్నవి. కావున గ్రంథవిస్తరభీతిని సంస్కృతము నుదాహరింపక వలయుపట్ల నాంధ్రీకృతంబులగు పద్యంబులే యుదాహృతంబు లగుచుండెడిని.

### —— • చతుర్యుగ స్వరూపము • ——

పంచచామరము.

"చతుర్యుగస్వరూపముం బ్రసన్నదృష్టితోడ వి
స్రుతంబుఁజేయునౌను మాకు సూత! తత్ప్రమాణముల్
గృతాది తన్మహత్త్వముఁ గీర్తనీయమంచు" నీ
గతిన్ ద్విజాళి పృచ్ఛఁజేయఁ గాంచి యాతఁడిట్లనున్, 873

కం॥ "ఇయ్యర్థంబుం గూరిచి యయ్యింద్రుం డడిగియుండె నాచార్యునిమున్,
స్నెయ్యదికాఁ ద్రచ్చెనొయుతెఁ డయ్యెడివచియించు వాఁడ నంతయు మీకున్, 874

ఉ॥ తొల్లి శచీసమేతముగ దొడ్డసభాస్థలిఁగూరుచుండి శో
భిల్లెడి పాకశాసనుని బ్రీతి భజించిరి వచ్చి దేవతా
తల్లజ సిద్ధసాధ్య ముని దైత్య భుజంగమ కిన్నరాప్సరః
ఫుల్లసరోజ నేత్రలు ఋభుప్రభు భక్తిపురస్సరంబుగన్, 875

కం॥ కలలుం గాష్ఠలు నిమిషమ్ములు నక్షత్రమ్ములు గ్రహములు మూర్తము
లలసెడి సాంగ్రతుసులును బలుతీర్థము లాలయములు భజియించె నటుల్, 876

చం॥ అటు సుమహత్రయంస్థితి సురాసురులెల్లరుఁ బ్రీతితోడ ము
న్నటి మునిరాట్పురోహితులఁ బల్కులు నొక్కరొక్కరుం బరి
స్ఫుటగతిఁ జెప్పికొంచు నటఁ బ్రొద్దులు పుచ్చుచునుండ నింద్రుఁ డొ
క్కట నవకాశముంగని వికస్వరవక్త్రసహస్రుఁడై 877

బుట్టుచెట్టులా యట్టులే గిట్టుటయును నొయ్యనొయ్యన ఘటియించుచుండుఁగాని
మృతసుతుం బితగాంచఁడు కృతయుగమున, నేమనంగల దోసుతస్వామి! యింక,

ఉ॥ కారు పిశాచము ల్మృతినిగాంచినయట్టిరు, వ్యాధిపీడితు
ల్గారుసతీవిభుల్, యము నగారము గాంచరు, వేదమార్గసం
చారము సేయుచున్ ద్విజులు శాస్త్రము లెల్లఁబఠించి వ్యాఖ్యలన్
గూరిచి బ్రహ్మనిష్ఠులయి కుంభిని గోవిదులై చరింతురో! ౪౦

తే॥ క్షత్రియు లృక్తిసొక్కని క్షాత్రతేజుఃగాగనోవరించి యతనియాజ్ఞను ధరిత్రి
ననుభవింతురు ధర్మమార్గానుయాయులగుచు సతతంబు వృత్తానురాగుపారణ!

క॥ ఊరవ్యులు క్రయవిక్రయగోరక్షణకృషిముఖార్థములసముచితక
ర్మారంభకారులగుచును దారుందురు కృతయుగమున దైత్యధ్వంసీ! ౪౧

ఆ॥ విను శ్రద్ధావమైన విప్రులశుశ్రూష మాని యించుకంతయేని యితర
మాచరింపఁజూడ రవరజు ల్వారుహాలాత! కరము శ్రద్ధఁ గృతయుగంబులోన, ౪౨

క॥ ఉదయింపఁడు సంకరుఁడపు, డుదయింపం డంత్యజుండు, నొకసులమందే
నుదయింపం డపవిత్రుండు, త్రిదశేశ్వర! కానఁబడఁడు స్థిరఁ బంచముఁడే, ౪౩

తే॥ యజనయాజన దానవ్రతాది నియమతీర్థసేవాదులన్నియుం బ్రవరరాజ!
జనులు నిష్కాములగుచునే సలుపుచుందు రాదియుగమున బ్రహ్మపూర్వకాలమున,

వ॥ సర్వలోకసుఖావహంబును బుణ్యంబును నగు నాకృతయుగంబు కడచన్న
యనంతరంబున ద్వితీయంబగు త్రేతాయుగంబు సంప్రాప్తించెడి నయ్యది పండ్రెండులక్షల
తొంబదియాఱువేల ౧౨౯౬౦౦౦ వర్షంబులు ప్రవర్తించెను నందు భగవంతుండును
జగన్నాధుండును నగు గరుడధ్వజుండు శ్వేతద్వీపాశ్రయుండై రక్తవర్ణంబున విరాజిల్లు
చుండుఁ, ద్రిపాదంబై ధర్మంబును నేకపాదంబై పాతకంబును వర్ధిల్లుచుఁ గానంబడియుండు,
నేకపాదంబగు తత్పాతకంబుచేతనే వర్ణంబుల కితరేతరస్పర్థ యంకురించు, నంత
ఫలాభికాంక్షులయి తే జనులు తీర్థయాత్రాదికంబు లాచరింప మొదలిడుదు, రట్లు వ్రతని
యమాదులన్నియుం బ్రదిదపాతుకఁబులై యుండుటయు ౪౪

తే॥ కామమున మోహముదయించుఁ గలుగు దాన ద్రోహమది చేయు నగుఁ బ్రజ దురిత
తమస్సు,
రౌరవాద్యేకవింశతిరౌద్రనరకములను సంసిద్ధపఱచు యముండు వజ్రుడు, ౪౫

తే॥ కర్మముల కనుకూలమౌగతిని జనులు గాంచుచుందురు తన్నారకంబు లింద్ర!
కొంద రోకెంచి స్వర్గంబునందయుంద్రు, కొంతమందికి మోక్షంబుగాధ ద్వారము,

ఉ॥ ఉత్తమమధ్యమాధమత నందుఁ బ్రజను త్రివిధంబుగానుదా,
ఉత్తమమధ్యమాధమత నందును జాత్యులు మూత్తెఱంగులై,
యొత్తున నొక్కతాళమున కీడయి యుండి సమస్తమౌ జనం
బాత్తబలప్రభావముగ నత్తఱిక త్రిలు నింద్రయింగతిఁ, 898

చం॥ జరుపుమరూరుజుల్ కృషిని శ్లాఘలి దున్నుచు సస్యలిప్సమై,
బెరిఁగిఫలించు సస్యములు, ప్రీతినిగోయుదు రేడువారముల్,
తరులు సకాలమందునను దప్పక పక్వవిరాజితంబులై
విరులు ఫలంబు లిచ్చుచును వేడుకసేయు జనాళి కెంతయున్, 899

తే॥ స్వర్గమునుగోరి బ్రాహ్మణుల్ క్షత్రియులుఁ బరస్పరస్పర్థఁ బెక్కధ్వరములుచేతుఁ
రాచరింత్రు రూర్ధ్వగతికిఁగా నఖిలజనులు తీర్థయాత్రాంహతివ్రతాదికములెల్ల, 900

తే॥ వేదుఁదేదులమీదట విబుధరాజ! జన్యనముగల్గుఁ ద్రేతిలో జనములకును,
షట్సహస్రాబ్దములమీఁద సంభవించు వార్ధకావస్థ క్రమముగా వారలకును, 901

వ॥ శుభియయు వయ్యోగంబున యోనిసంసర్గంబునుండి రజకుండును జర్మకారుండు
ను నటుండును బురుడుండును గైవర్తుండును మేదుండును భిల్లుడును జండాలుండును
లోనుగాఁగల నిందితు లసంఖ్యాకులై యుద్భవింతు"రని చెప్పటయు వయ్యిఁద్రుండు 902

క॥ "వీరలయందఱియందయం జేరీతిగ నయ్యెనయ్యా, యిదియంతయు నాం
గీరస! యున్నదియున్నట్టారూఢిం జెప్పు" మనుడు నతడిట్లనియెన్, 903

సీ॥ బ్రాహ్మణస్త్రీయందఁ బ్రభవించు సూతుండు క్షత్రియపురుష సంసర్గమునను,
బ్రాహ్మణస్త్రీయందఁ బ్రభవించుఁ రజకుండు సూతరేతః ప్రణిపాతమునను,
బ్రాహ్మణస్త్రీయందఁ బ్రభవించుఁ జర్మకృత్తధముడౌ రజకుని యభిగమునను,
బ్రాహ్మణస్త్రీయందఁ బ్రభవించు నటుఁడును జర్మకృత్సాంగత్యకర్మమునను,
వ్యగ్రతాతిశైనయింగన హీనులఁడగిలి పడయు నిట్టినుభవులకు,
జెట్టుచెడినవాఁడు పుట్టుచుండునే కుక్కమూతిపిందె లోకమునఁగిని, 904

తే॥ మతియును.

సీ॥ తనను దద్బ్రాహ్మణవనితయే మాగధు జైక్యతోనగు రహోవర్తనమునఁ,
బడయు దద్బ్రాహ్మణభామయే బురుడుని మాగధసాంగత్యమహిమవలనఁ,
గాంచుఁ దద్బ్రాహ్మణకాంతయే కైవర్తు బురుడునితోడనౌ పొందువలన,
గాదవుఁ దద్బ్రాహ్మణయువతికే మేదుండు కైవర్తుకూటమి గలుగుకతన,

కం॥ అల్పాయువు నత్యంతంబుగ నల్పంబడుబడును వర్ణసంకరము, నీ
తెల్పఁబడుచొప్పదప్పి యనల్పాయువులై నవార లగుదురు వ్యాధితుల్, ౨౨౫

చం॥ తరియవు యుక్తకాలమునఁగూడ నవృష్టిని వారివాహముల్,
తరియ నెచూడు, కర్షకులుకోరినతీరున సైర్భలింపఁడో,
నరపతి! యేలు పాలనిడఁజాడఁవు పోషితమయ్యె బాగుగా,
విరివిగ మేపఁగాఁబడియు వృద్ధినిబొందదు శేమిచిత్రమో, ౨౨౬

చం॥ గొటియల నొంటెలం బెనిచి క్రోలఁగఁజూతురు వానిక్షీరముల్,
ధరణి ననేకమర్త్యులకు దస్కరభావము లగ్గుఁబాలతోఁ
బెరుఁగును, ధర్మకర్మములు పేరునకుండవు, వీరి చెంతను
సిరి యరుదెంచి యుండుటకు సిగ్గిలుచుండు, నీకేమి చెప్పనో, ౨౨౭

సీ॥ జపతపంబులు లెన్న సలుపఁజూతురుచుమీ కలిలోన శూద్రులు క్రతుభుగధిప!
ధర్మపరాయణుల్ తారయాదురుచుమీ కలిలోన శూద్రులు బలిసపత్న!
వేదముల్పఠియింప విక్రమింతురుచుమీ కలిలోన శూద్రులు జలదవాహ!
యజ్ఞముల్సేయుఁగ నుత్సహించెదరుచుమీ కలిలోన శూద్రులు కులిశధార!
దాతలుం బ్రతిగ్రహీతలు శూద్రులై రాలఁగలరు శక్ర! కలియుగమున,
వంద్యులును సుశిక్షబాలులు శూద్రులే కాఁగలారు వజ్రి! కలియుగమున! ౨౨౮

కం॥ శ్రుతశాస్త్రాధ్యాపనశీలతఁ బ్రతినగరి ననిశ్యపుట్టపగిలినపగిదిన్
తితిసురులు సంచరింతురు శతమన్యూ! మనుపుట్టి శాస్త్రపతి తెమిక్, ౨౨౯

వ॥ మఱియును.

కం॥ విప్రుఁగఁజూడఁదగిన లక్షిత్తులయున్నంతయుదినుచు కేవలకర్మా
నుష్ఠానంబుగ నెంచుచుఁ దివ్యస్తోత్రత్వమునను దిరిగెద రవనిన్, ౨౩౦

వ॥ ఇదియుం గాక,

సీ॥ భాషాంతరగ్రంథపారాయణంబులే స్వాధ్యాయపఠనప్రసక్తిగాఁగ
దుర్భావసంగ్రహాధ్యాత్మవాకత్వమే విహితమౌ సత్ప్రతిగ్రహముగాఁగ
వేదబాహ్యమతప్రవిష్టమానసతయే పరమేశ్వరధ్యానపరతగాఁగ
పారదేశికవేషభాషాకలంబమే వర్ణాశ్రమాచారవార్తగాఁగ
బరసతీద్వారమువసైన బ్రిదుకుతెరువె మాన్యమైన గృహస్థధర్మంబుగాఁగ
ధారుణికి భగ్గలంబైన భారమగుచు నుందు రమరేశ! కలియుగమందు ద్విజులు,

యుగాంతరీయ చరిత్ర మనకుఁ దెలియకున్నను కలియుగస్వరూపము వైశాఖ
మాహాత్మ్య ప్రకరణ ప్రచురింపఁబడిన స్కాందమహాపురాణాంతర్గత నాగరఖండోక్త ప్రకా
రముగనే యుండియుండుట ప్రత్యక్షసిద్ధము. అన్నింటికంటెను "పండితు ల్పామరప్రా
హసపాత్రతఁ గొలుగానియట్టిరే కూరుచుండు" అన్నదే యిప్పుడు మఱియును నను
భవమునకు వచ్చుచున్న విషయము. అంటగానివాండ్రో వాళ్ళో రెండును గనిపెట్టలేని
వారేకదా శ్రుతిస్మృతిపురాణధర్మముల బోధించుచుఁ దదుక్తప్రకారమునడచెడి పండి
తుల నిందించుచు నస్పృశ్యతాదోషము హేయమును ఘోరమును పాపభూయిష్ఠము నని
లోకులకు ధర్మబోధచేయువారు? యీకాలపరిస్థితు లిట్లుండునని కనిపెట్టుటవలననే
యిట్టికాలమున కనుగుణమైన మార్పులు త్రికాలవేదులగు నస్మదాచార్యులే చేసియున్నా
రు. శ్లో॥ ధ్యాయన్ కృతే యజన్ యజ్ఞైస్త్రేతాయాం ద్వాపరేఽర్చయన్, యదాప్నోతి తదా
ప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్॥ ధర్మోత్కర్షమతీవాత్ర ప్రాప్నోతి పురుషః కలౌ, అల్పాయా
సేన ధర్మజ్ఞాస్తేన తుష్టోస్మ్యహం కలేః॥ అనువాక్యములచే వేదవ్యాసులు కృతయు
గమున నీశ్వరధ్యానమునుండియుఁ ద్రేతయందు యజ్ఞాచరణమునుండియు ద్వాపరమున
నీశ్వరారాధననుండియుఁ గలిగెడి ఫలములు కలియుగమునందొక్క యీశ్వరనామ కీర్తన
మువలననే కలుగుననియు నిదియే ధర్మోత్కర్షమనియుఁ దెలుపుచు నంతటి యల్పాయాస
ముచేతనే జనులు కృతార్థులగుటకుఁ దమసంతోషమును వెలిబుచ్చియున్నవాఁడు.
శ్లో॥ యస్తు కార్తయుగో ధర్మో నకర్తవ్యః కలౌయుగే, పాపప్రసక్తాస్తు యతః కలౌ
నార్యో నరాస్తథా, నవిద్వత్తా నశుద్ధోఽర్థో నశుద్ధిర్మనసః కలౌ, యతో నసత్యమే
వైకం నరాణా మపకారకం॥ అనువాక్యముచేఁ గలియుగమందలి స్త్రీలును బురుషు
లును పాపప్రసక్తులగుటవలనఁ గృతయుగధర్మము పనికిరాదనియు విద్వత్తగాని మన
శ్శుద్ధిగాని పరిశుద్ధకార్యములుగాని లేనికారణమున నొక్కసత్యమే యుపకరింపవలెన
నియు నాదిత్యపురాణమును, శ్లో॥ సర్వాణి ధర్మజాలాని సాహాయ్యాని కలౌయుగే,
అన్నదానం హరేర్భక్తి రనపాయ మిదంద్వయమ్॥ అనువాక్యముచేఁ గలియుగ
మందే ధర్మములు చేసినను సక్రమముగా నిర్వర్తింపఁబడక యపాయము
గలిగించుననియు నన్నదానమును హరిభక్తియు నీరెండునే యనపాయములనియు మఱి
యొకస్మృతియు "హరేర్నామైవ నామైవ నామైవ భవభేషజం, కలౌ నాస్త్యేవ నాస్త్యేవ
నాస్త్యేవ గతి రన్యథా, కలౌ కృతయుగం తస్య కలిస్తస్య కృతే యుగే, యస్య చేతసి గోవిం
దో హృదయే యస్య నాచ్యుతః" అను శ్లోకద్వయముచేఁ గలియుగమందు సంసార
మన్న రోగమును గుదర్చఁగల యౌషధము హరినామమేయనియు నంతకన్న వేఱొండు
గతి లేనే లేదనియు నెవనిచిత్తమున హరిధ్యానింపఁబడుచుండునో వానికిది కలియుగ

ముగాక కృతయుగమే యనియు నెవనిచిత్తమున హరి ధ్యాతుండుగాకయుండునో వాని
కిఁ గృతయుగముకూడఁ గలిప్రాయమేయనియు నారదుండును వాక్రుచ్చియున్నవాఁడు.
కలికాలజనులు మందబుద్ధులగుటవలనఁ దరణోపాయ మతిసులభముగాఁ జెప్పి కష్టసాధ్య
ములగు కొన్నింటిని గలివర్జ్యములఁగాఁగూడ నిర్దేశించిరి. చూడుఁడు, స్మృతిరత్నాకరము
౧౩,౧౪,౧౫ పుటలు శ్లో॥ విధవాయాం ప్రజోత్పత్తౌ దేవరస్య నియోజనం, కన్యానా మ
సవర్ణానాం వివాహశ్చ ద్విజన్మనాం, ద్విజస్యాబ్ధౌతు నౌయాతుః శోధితస్యాపి సంగ్ర
హః, ప్రాయశ్చిత్తవిధానంచ విప్రాణాం మరణాంతికం, సంసర్గదోషః స్తేనాద్యైర్మహా
పాతకనిష్కృతిః, వరాతిథిపితృభ్యశ్చ పశూపాకరణక్రియా, దత్తౌరసేతరాణాంచ పుత్ర
త్వేన పరిగ్రహః, బ్రాహ్మణాదిషు శూద్రస్యపచనాదిక్రియాపిచ, మాంసదానం తథా
శ్రాద్ధే వానప్రస్థాశ్రమస్తథా దత్తాక్షతాయాః కన్యాయాః పునర్దానం వరస్యచ, ఏతాని
లోకగుప్త్యర్థం కలే రాదౌ మహాత్మభిః, నివర్తితానికర్మాణి వ్యవస్థాపూర్వకం బుధైః॥ వం
శవిచ్ఛేదమగుచుండిన విగతభర్తృక మఱఁదితోఁ గలసి సంతతిఁ గాంచుటయు బ్రాహ్మణులిత
రవర్ణస్త్రీల వివాహమాడుటయు బ్రాహ్మణుండు సముద్రయానము చేయుటయుఁ బ్రా
యశ్చిత్తము చేసికొన్నవానినైనను బరిగ్రహించుటయు విప్రులకు మరణాంత ప్రాయశ్చిత్త
మును స్తేనాదులతోడి సంసర్గదోషమును మహాపాతకనిష్కృతియు నతిథిపూజనమున
కును పితృకార్యములకును బశూపహరణక్రియయుఁ గడుపునం బుట్టినట్టి
వానిని బెంచుకొన్న వానిని దప్ప నితరులఁ బుత్రులగాఁ
బరిగ్రహించుటయు బ్రాహ్మణులయిండ్ల శూద్రులు వంటచేయుటయు శ్రాద్ధమందు
మాంసదానమును వానప్రస్థాశ్రమమును నొకరికిచ్చినకన్యకను గర్భాధానముగాకపూర్వము
మఱియొకరికిచ్చుటయు వీనిని గల్యాదియందు మహాత్ములు వ్యవస్థాపూర్వకముగా లోక
రక్షణార్థమై నివర్తించియుండిరి. శ్లో॥ అన్యే కృతయుగే ధర్మా స్త్రేతాయాం ద్వాపరే
తథా, అన్యే కలియుగే నౄణాం యుగరూపానుసారతః॥ అను పరాశరోక్తియు గానుసార
ముగాఁ గొన్ని కృతయుగమునకును గొన్ని త్రేతాయుగమునకును గొన్ని ద్వాపరయు
గమునకును గొన్ని కలియుగమునకును ధర్మములని చెప్పుచున్నదికాని కృతయుగధర్మ
ము లీకలికాలమున ననుష్ఠింపవలెనని చెప్పుటలేదు. ఋషులు పరమదయాళువులై
సర్వదా ప్రజాహితముకొఱకయియే పాటుపడెడివారు. కనుకనే శ్లో॥ త్యజేద్దేశం కృత
యుగే త్రేతాయాం గ్రామముత్సృజేత్, ద్వాపరే కులమేకంతు కర్తారంతు కలౌయు
గే॥ అనువాక్యమునఁ బరాశరుఁడు కృతయుగమున దోషి నివసించుదేశమును త్రేతలోఁ
గ్రామమును ద్వాపరమున వానికులమును వదలవలెనని చెప్పుచుఁ గలిలోఁ గర్తను
మాత్రము వదలినఁ జాలునని యనియున్నవాఁడు. కావునఁ ద్రికాలవేదులగు ఋషులయం

డా దాసీన్యముగనఁబఱచుట యతిగర్హితము. ప్రకృతధర్మములం బ్రహ్మర్షులచే నిర్విఘ్నమునఁ బ్రతిపాదింపఁబడియుండ భాషాభిజ్ఞులగు శాలకోడేటి గురుమూర్తియున్నగువారు పంచమోద్ధరణసంఘమునఁజేరి దేశనాయకులయొక్కయు మతగురువులయొక్కయునభిప్రాయములని కొన్ని జనులకు వినిపింపఁగడంగిరి. హిందూసంఘమునుబట్టి పీడించుచున్న యీరోగమునుగూర్చి వివేకానందస్వామివారేమియో చెప్పియున్నారఁట కనుఁడు.

“మనబ్రదు కెంతనవ్వులపాలైనది! ఒకమాదిగవాఁడు మనహిందూమతమందుండి మనదగ్గరకువచ్చినపుడు వానిని బొబ్బలరోగమువలె చూచి భయపడి దూరదూరముననుఁ బోవుదుము. కాని పాదిరీదొరగారు కొంచెము నీళ్లను నెత్తిమీఁదచల్లి యేదియో ప్రార్థన నొనగించిన తరువాత ఆమాదిగవాఁడే చిలికలచొక్కా నొకదానిని తొడుగుకొని అతి పూర్వాచారపరాయణుఁడగు హిందువుయొక్క యింటికి వచ్చినపుడు వానికి కుర్చీనిచ్చి యుచితమర్యాదలను చేయని హిందువు దుండడని నేను గట్టిగా చెప్పగలను. ఇంత కన్నను నగుబాటు వేరొకటుండదు”

పాదిరీదొరగారుగాని బ్రహ్మదేవుఁడుగాని. మాదిగవాని నెత్తిమీఁద నీళ్లేచల్లనీ నేయిచే పోయనీ. ఇట్టి పూర్వాచారపరాయణుఁడట్టివాని నాత్మీయునిగనుఁ గానిచ్చి యాసనప్రదానముచే నాదరింపఁడు. వారితో వీరిపన్న పనియుఁ గనఁబడదు కావున నిట్టి వ్రాఁతలు వ్రాసికొనుటయే హాస్యాస్పదము. అప్రమాణసిద్ధ కని యందుల నంగీకరించుటలేదుకాని అంటనియకున్నమాత్రమున నే యవ్వారి కఖిలభూతములందును ననుగ్రహము లేకపోలేదు. వృథాజల్పనములుతప్ప వారిని బూసికొనితిరుగడివారు తప్పవి పలుకేత్తుచున్నది లేదు. తిరుగనివారె త్తనదిలేదు. నిమ్నజాతుల కేర్పడియున్న హైన్యము శ్రుతిస్మృత్యుక్తవిధంబున జన్మాంతరీయ దుష్కృతసిద్ధముకాని హిందూమతావలంబులకు భక్తులయొక్క కాని నిష్పాపులయొక్క కాని కరుణాలోపమువలనఁ గలిగినది కాదు. ఈలోపమంతయు శాస్త్రవిధిం ద్యజించి యిష్టమువచ్చినట్లు సనాతనమతస్థుల దొంగలని ముఖవంచకులనియుఁ దెగవ్రాసిన వివేకానందునిదే కాని యన్యముకాదు. [సశేషము]

---

## —* భారతీయ వస్త్రధారణము *—

మన భారతీయులు పూర్వమున నెట్టివస్త్రములను ధరించెడివారో యిపుడెట్టివస్త్రములను ధరించుచున్నారో యెందేవిధరించిన మన కారోగ్యము చెడకుండునో యాలోచించి చూతము. పూర్వపువస్త్రము లెట్టివని తెల్పుగ్రంథము లెవ్వియుఁగానరావు. కాని భారతమందుఁ గొన్ని నిద

ర్శనములు గలవు. వాని నాధారముగఁ జేసికొని మన దుస్తులను విశదీ
కరించెదను. మగవారు దోవతిని ధరించి యుత్తరీయమును పైనవేసికొ
నెడివారు. భారతమున ద్రౌపదిని సభలోనికి నీడ్చుకొని వచ్చినపుడు
దుర్యోధనుఁడు తన తొడనుండి వస్త్రమును దొలఁగించినట్లు వర్ణింపఁబడి
యున్నది. దీనివలన దోవతిని గట్టుకొనువారలని తోచుచున్నది. అట్లుగా
నిచోఁ దొడమీఁద వస్త్రమును దొలఁగించుట సంభవింపనేరదు. కనుక
నాకాలమందలి నవనాగరకులగు నాంగ్లభాషాకోవిదులు ధరించునట్టి
లాగులను దొడిగికొనక దోవతులనే ధరించెడివారని నిస్సందేహముగాఁ
జెప్పవచ్చును. దోవతిని గట్టుకొనునపుడు నాలుగు చెంగులను ముడిచెడి
యలవాటుగలదు. ఇపుడు జారుగోచీలవారి సంఖ్య యధికమైనది. ఈ
గోచీలవలనఁ గొంత శరీరారోగ్యము చెడిపోవును. మన శరీరమునందు
రోమకూపములనుండి తేజస్సు బయలికివచ్చును. అట్లువచ్చిన తేజస్సు
ఈవస్త్రమందలి నూలుపోగుతో సంక్రమించి యద్దానితో జారిపోవును.
ఆప్రకారముగాఁ బోవుటవలన బలముతగ్గి యాయుఃక్షీణము సంభవిం
చును. నాలుగుచెంగులను ముడిచినచో నట్లుపోక తిరిగి యాపోగువెం
బడి మన దేహముననే ప్రవేశించును. ఈచెంగులు ముడుచుట కచ్ఛశబ్ద
మువలనఁ దెలిసికొనవచ్చును. కచ్ఛ అనఁగా ముడతయని యర్థము. ఇట్టి
ముడతలైదుండవలెనని మన ధర్మశాస్త్రములవలన విదితమగుచున్నది.
ఇప్పటికిఁ బంచకచ్ఛలతో దోవతిని గట్టుకొనవలెనని విదితమైనది. ఇఁక
రెండవదియగు నుత్తరీయమును గుఱించి భారతమం దాధారములున్నట్లు
గానరావు. కాని "సోమస్యేత్యుత్తరీయం" ఇవి మొదలగు మంత్రము
లచే నుత్తరీయముకూడ నున్నట్లు చెప్పవచ్చును. మన ధర్మశాస్త్రమందు
నుత్తరీయమును యజ్ఞోపవీతముగఁగాని కటిప్రదేశమందునఁగాని ధరించ
వలెనని చెప్పియుండుటవలన నుత్తరీయమునుగూడ నాకాలపువారు
ధరించుచుండెడివారని తోచుచున్నది. ఈరెండునుగాక నుపవస్త్రమును

## పుట్టినబిడ్డలు మృతులగుట.

[ యస్. నారాయణరాజుగారు, పరిగి ]

అనేకచోట్ల పుట్టిన వెంటనేగాని 2, 3 నెలదినములలోగాని బిడ్డలుమరణింతురు. ఇందుకు గతమేమి? బాలగ్రహము, సందు, ఋణబంధము మొదలగు హేతువులను, కొందరిని పెంచి, కొందరిని త్రుంచెడు దేవుని వలపక్షమును మన యాడువారెకరువుపెట్టెదరు. పరికించిచూడగా యీదురదృష్టము మనుష్యసంతానమునకేగాని పసుపక్ష్యాదుల సంతానమునకు పట్టినట్లు గన్పట్టదు. అవును నీతినియమములు లేక రాత్రి పగలు నదేచింతతో విషయలోలురై కామసుఖప్రమత్తులై చరించుచు, జిహ్వోపస్థాపరాయణులై జీవించువారి సంతానమునకుగాక ప్రకృతిధర్మమును మీరక స్త్రీయొక్క సహజమగు నింద్రియేచ్ఛ (ఋతువు) ననుసరించి, కేవల సంతానార్థము కామువిషయమున ప్రవృత్తములగు పశుపక్ష్యాదుల సంతానమునకేల యీదుర్దశవాట్లును? చరాచరములన్నిటిలో శ్రేష్ఠుడనని తలచి, నీతినియములులేని స్వేచ్ఛకు హక్కుదారుడనని మానవుడు విఱ్ఱవీగుచున్నాడు. కాని తానుకూడ ప్రతిఘటింపరాని ప్రకృతిధర్మమును మేరను మీరినచో సుఖింపజాలనని యింకను బాగుగ గ్రహింపలేదు. అందువలననే దురంతదుఃఖములకు పాల్పడుచున్నాడు. గర్భధారణమైనను కామకర్మమూనని యవినీతులగు తల్లిదండ్రుల ముఖావలోకనముచేయ రోసియోయన కన్నులుతెరువని కూనలు కాలగతినొందుచున్నారు



# పీఠిక.

భావసంవత్సర నిజాషాఢబహుళ సప్తమీ భౌమవాసరమునకు సరియగు క్రీ॥ 1874 వ సం॥ అగష్టు 4 వ తారీఖు నా జననదినము. నేను సంకోచముం బొందుచు సాహిత్యమున వచ్చియు రాని కవిత్వ ముపక్రమించినది పదునేనవయేట. వ్యాకరణజ్ఞానశూన్యముగా నాంధ్రకవిత్వారంభము ౧౫ వ యేట. అప్పటినుండి ౮ సంవత్సరముల కాలము తాత్కాలికములగు చాటుపద్యములతోడను సమస్యాపూరణములతోడనే గడపితినిగాని యే భావముండుదు నొక్క గ్రంథమైన వ్రాసియుండను. ౨౩ వ యేట గీతివృత్తములతో నీతిగీతులను పేర సుమతిశతకము గీర్వాణీకరించి పుష్పబాణవిలాసమను మొండొక్క శృంగారముల ప్రబంధ మొకటి యాంధ్రభాషను విరచించితి. ౩౦ వ యేట వాసంతికాపరిణయమను నొక సంస్కృతనాటకము దెనిఁగించితిని. ౩౧ వ సంవత్సరమున విద్యారణ్యకృత శంకరవిజయముం దెనిఁగింపఁబూని ౬ సర్గలుమాత్రము వ్రాసితినిగాని యింతవఱకును దాని ముగించుటకు నోఁచుకొనను. ౩౮ వ యేటఁ గంసవధమను సంస్కృతనాటకముం దెనిఁగించి విగ్రహాత్మకశీలసముపాంశరమను నొక నిష్పఠము సంస్కృతమునందు విలిఖించితి. అట్లు భాషాసేవనమునకుఁగా భావం బుద్ధాత్తమగుటయే కాక ధర్మప్రచారణమందు పుంపఁ దత్పరముగుటయు నక్కాలీయద్వితీయము యక్కాలక్తి నెఱవేర్ప నభినవసరస్వతీపత్రిక నార్జింపఁగలిగితి. పంచత్రింశదబ్దంబునఁ బ్రారంభించి ప్రాగుక్త మదీయ గ్రంథంబులతోడను గౌణములగు ప్రాచీనప్రబంధంబులతోడను బ్రతిమాసం బలంకరించుటయే కాక భాషనుగూర్చియుఁ బరమార్థమునుగూర్చియుఁ బరకీయములును స్వకీయములు నైన బహువ్యాసంబులును గ్రంథంబులును బ్రచురించుచుఁ బత్రికాపుత్రికఁ బదుమూఁడేండ్లప్రాయము ప్రాప్తింపఁజేసితిని. కావ్యచంపూనాటకవ్యాఖ్యానంబులు మూఁడే కలవు కాని కవితావిషయంబున నాకుఁ బ్రత్యక్షగురువు లెవ్వరును లేరు. ఏకలవ్యన్యాయమునఁ దిరుపతివేంకటేశ్వరులే నా కవితాగురువులు. కాని గుంటూరు టవున్ హైస్కూలు తెలుగుపండితులగు శిష్టా హనుమచ్ఛాస్త్రిగారు ప్రతిగ్రంథముం బరిశీలించుచు నాకవిత్వమునకు మెఱుఁగుఁ బెట్టిరి. "శ్రీ గురుభ్యోనమః" యని పుస్తకము చేతఁబట్టి పాఠము చదువలేదుకాని వ్యాకరణరహస్యముల బాల్యమునఁ దత్సాన్నిధ్యముననే తెలిసికొనఁగలిగితి.

అదివఱకు నేను వ్రాసిన గ్రంథములన్నియు సామాన్యములై యుండుటచేతను కేవల మాముష్మిక సాధకంబగు పెద్దగ్రంథ మొద్దియేని వ్రాయుటలంపుతో నున్న నాఁడ

యగుట నీనాగరఖండము నాంధ్రీకరించుటకు నిశ్చయించుకొని కృత్యాదిపద్యంబులఁ దరువాత వానిపికొనవచ్చునని కథారంభమునుండి యాంధ్రీకరణమున కుపక్రమించి వ్రాయుచు నించుమించుగా మున్నూఱుపద్యము లగునప్పటి కభినవసరస్వతి కొక ప్రధానపోషకుఁడగు శ్రీ బాకరాజు వరాంకుశ గావుదేశముఖుగారిని సందర్శించుటకుఁజని రెండు మూఁడుదినంబులు మృష్టాన్నవిశిష్టంబగు నాతిథ్యంబునకుఁ దుష్టింజెందుచుఁ దద్గృహంబున వర్తించి తత్సమీపవర్తి శ్రీగసాగరనాయక గ్రామ నివాసియు సంతతపరోపకారపారీణుఁడును విద్యావిప్రియుఁడును సన్నదాతయు యథోచితోభయభాషావిదుఁడును రసికుండును సుజనుండును నస్మన్మిత్రబాంధవుండును నగు రాళ్ళభండి రత్నయ్యగారు ప్రాణసఖుండగు నాదేశముఖుచే నెందులకో యాహూతుండై యక్కాలంబున కందు వచ్చియుండ నవ్యూభయులతోఁడి సద్గోష్ఠులం దేలుచు యాదృచ్ఛికంబుగ నీనాగర ఖండపద్యంబులఁ గొన్నింటిఁ జదివి వినిపించితి.

అప్పు డయ్యిరువురును బరమాస్తికులును భగవద్భక్తులును రసికులును నగుకతంబునఁ దదాకర్ణనజనితసంతోషవార్ధినిమగ్నమానమానసులగుచు నక్కథామాహాత్మ్యంబును బద్యమార్దవంబును బహువిధంబులఁ బ్రస్తుతించి "యీకృతినాయకుఁ డెవ్వ"రని" నన్నుఁ బ్రశ్నించుటయు నేను నుండినవాస్తవంబు వక్కాణించితిని. అంత నాజమీందారు పుత్రసంతానములలో నిది యొక్కటియె కొఱఁతగానుండినవాఁడగుట "నిత్యుర్థి మీ బోటి విద్వత్కవులద్వారమున నెఱవేఱవలసియున్నదికావున మీకృతికన్యక నాకొసంగుఁ" డని తన యభిమతంబు వెలిఁబుచ్చుటయు శౌర్యౌదార్యాద్యనవద్యగుణవిశిష్టుండగు బ్రాహ్మణప్రభువు మత్కృతికన్యకు వరుండుగా దొరకుటకన్న నైహికభాగ్యంబు వేఱె యేమియున్నదని యందులకంగీకరించితి. అంత నాభూమీశుండు తాత్కాలిక యథోచితసత్కారంబుల నన్నుఁ బరితృప్తుంజేసి వేయినూటపదియాఱులు వేవేగ సమర్పించుటకు వాగ్దానంబొనరించి యస్మదాంధ్రీక్రియమాణ పురాణ ప్రచురణంబున కనుజ్ఞయిచ్చుటయు నభినవసరస్వతీద్వారంబున వత్సరద్వితయంబునుండి ముద్రింపించి ప్రకటించుచున్నవాఁడ. సంవత్సరమున కొక్కయాశ్వాసముచొప్పున నిప్పటికి రెండాశ్వాసములు ముగిసినవి. గ్రంథమేకోనాశీత్యుత్తర ద్విశతా(౨౭౯) ధ్యాయపరిమితం బగుటవలన నే యాశ్వాసమున కాయాశ్వాసమే ప్రచురపఱచుటకుఁగాఁగొందఱు తొందరించుచున్నవారు. అట్లుగానున్న నీ రెండాశ్వాసములకొక సంపుటముగానైనను బ్రకటించుట కియ్యకొని దీనిని వెల్లడింపఁగలిగితి. స్కాందము మహాపురాణముగను నుపపురాణంబుగను నుండియున్నయది అందు మహాపురాణము పదునెనిమిదింటిలోఁ బదుమూఁడవదిగాఁ

బరిగణింపఁబడుచు నేకాశీతిసహస్ర గ్రంథపరిమితంబును మాహేశ్వర వైష్ణవ బ్రాహ్మ కాశ్యవంతికా నాగర ప్రభాసాఖ్య సప్తమహాఖండాత్మకంబును కేదారాద్యనేకవింశత్యవాంతరఖండమండితంబును నై యొప్పెడి. మాహేశ్వరాది సప్తమహాఖండంబులును నొక్కొక్కటి యతిక్రమించి న్యూనాధికంబుగ ద్వాదశసహస్రగ్రంథవిరాజితంబులు వానిలో నీనాగరఖండము షష్ఠంబును, తీర్థమాహాత్మ్యప్రచురంబును నై యలరారెడి. కను కనే యీ ఖండంబునకు హాటకేశ్వరక్షేత్రమాహాత్మ్యమనికూడ నామాంతరము గలదు.

హాటకేశ్వరక్షేత్రమనునది యానర్తదేశస్థము. కాని తద్దేశగతంబగు ద్వారకవలెఁ దత్క్షేత్రంబునకును దఱచు యాత్రికులు చనుచుండుట కనుపట్టదు. బ్రహ్మణ్యుఁడగు పరాశరసూనుఁడు పండ్రెండువేలశ్లోకంబులచేఁ బరికీర్తించిన యియ్యది మహాక్షేత్రమనుటకు సంశయము గానరాకున్నను గాలాతిపాతవశంబుననో యేలయో పాశ్చాత్యంబులగు నితరక్షేత్రంబులవలె నస్మద్దేశీయుల శ్రుతిపథంబుల నంతగాఁ బ్రసరించి యుండదు.

తే॥ "మూఁడునరకోట్లతీర్థము లరుగుడెంచి హాటకేశ్వరమంతయు వ్యాప్తమయ్యె,
వానినన్నింటిఁ గీర్తింప వశముకాదు వర్షశతమునకైన మహర్షులార!
ఆ॥ ప్రథమకల్పమందు స్వాయంభువాఖ్యుఁడౌ మనువునంతరమున మానులార!
అఖిలతీర్థములును హాటకేశక్షేత్ర మాశ్రయించియుండె నరుగుదెంచి,
కం॥ బహుకాలమునని యుండుట బహుతీర్థము లాలయములు పాడువడెంగా,
మహిమాఢ్యములై ప్రకృతము వహియించెడివాని వినుఁడు వక్కాణింతున్"

అను నిందలిపద్యంబులచేఁ బ్రథమకల్పములోని స్వాయంభువమన్వంతరమున నీక్షేత్రమునవచ్చిచేరిన సార్ధత్రికోటితీర్థములలో సూతుఁడు శౌనకాదులకీగాథ చెప్పు నాఁటికే పెక్కు ఖిలములైనట్లు కనఁబడెడిని గావున నిప్పటి కింకను క్షీణదశలో నుండిన నుండవచ్చును. పురాణకథితంబులగు ననేకక్షేత్రముల మహత్త్వమిక్కాలమున కట్టులై యున్నయది. మనదేశమందలి యమరావత్యాదిక్షేత్రంబులును నత్యంతమహిమాన్వితములు. అయ్యవియు నేతద్దేశవాసులచే సేవింపఁబడుచున్నను దూరదేశములనుండి యాత్రికు లంతగా వచ్చుచుండుట గానుపింపదు. అటులనే యీ క్షేత్రమును దద్దేశమున నట్టుకే ఖ్యాతమైయుండనోపు. ఇంకను దీనిపూర్వోత్తరములు విచారించి యనంతరావ్యాసపీఠికలయందు వివరింపఁబడును. ఈ క్షేత్రమునకుఁ జమత్కారపురమను మఱియొక పేరుగూడ నుండినట్లును గయాశీర్షాదు లిందు యుండినట్లును

# విషయసూచిక.

—:o:—

ద్వితీయాశ్వాసము.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౪ | ౨ | బగిశంబ | జవిశంబ |
| | ౧౦ | ద్రుమగణా | ద్రుగణమా |
| | | స్వాత | విత |
| ౬ | ౧౫ | లేను చెచ్చె | లెంతయుం |
| | | లుల | శైలుల |
| ౭ | ౧౮ | వట్టు | నొట్టు |
| ౧౦ | ౨౧ | తిర్పురుపా | తిత్పురుపా |
| ౧౬ | ౨౬ | యిధయు | యథయు |
| | ౨౭ | నఫు | నవు |
| | | సుఖాదికి | సుఖాధికం |
| ౧౭ | ౨౮ | కొయుక్రో | కొయుచో |
| ౧౯ | ౨౭ | యిసువు | విసువు |
| ౨౦ | ౪ | అనిశవి | అనివవిని |
| | ౧౮ | సవాపారి | సహస్రా |
| ౨౨ | ౩ | దమ | దమం |
| | ౨౨ | కృష్టబు | కృష్ణంబు |
| | ౨౫ | మహా | మహీ |
| ౨౮ | ౧౨ | సుదుజా | సుగుణా |
| ౨౯ | ౨౩ | యాఘాగ | యాయథార్థ |
| ౩౦ | ౨౮ | రౌరవాడి | గౌరవాది |
| ౩౫ | ౮ | ద్వేషిని | ద్వేషిణి |
| ౩౬ | ౫ | శ్రేక్ర | శక్రి |
| | ౭ | లబ్ధి | లబ్ధి |
| | ౮ | అపవృడు | అవవృడు |
| | ౧౦ | చరిమను | చరింమను |
| ౩౭ | ౨ | కుద్ధ | కుద్ధ |
| | ౨౬ | భూమధర | భూమిధర |
| ౩౯ | ౨౨ | నేమందు | నేమందు |
| | | ను | ను |
| ౪౦ | ౯ | స్వగామ | సంగ్రామ |
| ౪౬ | ౪ | అగస్త్య | అగస్త్య |
| ౪౭ | ౧౫ | గూ | గూడ |
| ౪౮ | ౧౦ | సంసిద్ధి | సంసిద్ధి |
| ౪౯ | ౧౫ | నరడిట్లని | తావిట్లని |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| | ౩౦ | ప్రురి | పురి |
| | ౨౧ | స్ధితి | స్థితి |
| | ౩౮ | మానుకీన | మానుకీవ |
| ౫౦ | ౧ | శదోచ్చ్వా | శ్వేదోచ్చ్వా |
| | | రణ | రణ |
| ౫౨ | ౨ | క్రీతిం. | క్రీతిం |
| | | మార్పగాం | మార్పరోం |
| | | దె | దె |
| | ౬ | స్వమఘా | స్వసఘా |
| | ౧౩ | ఆమచు | అనుచు |
| ౫౩ | ౧౪ | మునీంద్ర | మునీంద్రు |
| | ౧౯ | పృధు | పృథ్వి |
| ౫౫ | ౨ | డివిధ | డీవిధ |
| ౫౬ | ౧౨ | ఘూర్గటి | ధూర్జటి |
| | ౨౦ | నావాస | దావాస |
| ౫౭ | ౫ | తీర్థమందు | తీర్థముందు |
| | ౧౫ | నన్నైన | నన్నైన |
| | ౧౭ | దురగ్వా | దురర్వాగ్మ |
| | | ము | ము |
| ౫౮ | ౭ | వఠని | పఠని |
| | ౧౧ | బలమూర | బలమువ |
| ౫౯ | ౧౨ | వింద్రు | యింద్రు |
| ౬౦ | ౧౨ | శేవతేళ | దేవతేళ |
| ౬౨ | ౭ | భాందవు | బాంధవు |
| | ౨౪ | చరించెచె | చరించదె |
| | | తద్దు | తడ్డు |
| ౬౩ | ౧ | లవలా | వవలా |
| | ౧౪ | టాల్చు | దాల్చు |
| | ౨౦ | మూన్యలు | మాన్యలు |
| ౬౪ | ౪ | దరుణి | దరుణీ |
| | ౧౭ | స్పర్శ్మనం | స్పర్శనం |
| ౬౯ | ౨౫ | పురప | పురస్స |
| ౭౪ | ౧౫ | వైశాఖ | వైశాఖి |
| ౭౬ | ౧౧ | స్థలమా | స్థలమున |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. | పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|---|---|---|
| ౭౭ | ౧౫ | మయాద్రి | మదయాద్రి | ౯౦ | ౩ | ద్వ్యుత్త్యనుకూల | ద్వ్యుత్క్రను కూల |
| ౮౩ | ౨౧ | సంది | వందిని | | | | |
| | ౨౯ | సెలక్ | సెల్లక్ | ౯౪ | ౧౦ | ధలము | ఫలము |
| ౮౬ | ౧౧ | షెప్పటట్లు | సెప్పటట్లు | ౯౫ | ౩ | వ ర్గ | వర్గ |

ద్వితీయాశ్వాసము ౧౬ వ పుట తుదనుండిన శివసమాశమైనయట్టి పద్యము ౧౭ వ పుటమొదట మరలc బడినది. ఆదేయాశ్వాసములో ౭౨ వ పుటతర్వాత ౭౩, ౭౪, ౭౫, ౭౬, ౭౭, ౭౮, ౭౯, ౮౦ పుటలు ౭౯, ౮౦, ౮౧, ౮౨, ౮౩; ౮౪, ౮౫, ౮౬ గాc బడినవి. పరిచూచుకొనవలె అక్షరములు ప్రాcతవైన కారణముచే పనులకును బవలకును భేదమంతగాc జాటింపc బడకుండెడిని. ఈనడుమc బొసంగిన మహాసంగ్రామమువలన వస్తువులకును ధరలు పెరిగియుండుట యందఱు నెఱింగియున్న విషయమే ఆకారణముచే మంచి కాగితము బహుధన సాధ్యమగుటయు నల్లిపొరవంటి కాగితమేయుపయోగింపcబడియున్నది. దానcగూడc గొన్ని యక్షరములు స్ఫుటముగాc గనcబడకయుండవచ్చునుగావున నిట్టిలోపములనుసవరించు కొందురుగాక.



# వర్ణధర్మములు.

నాలుగువర్ణములవారుఁ దమతమవర్ణములకుఁ దగినరీతిగా ధర్మాచరణ చేయఁదగియుండును. ఒకవర్ణమువారిధర్మములను మఱియొకవర్ణమువా రాచరించఁగూడదు. అత్రిస్మృతి శ్లో॥ యే వ్యపేతస్వధర్మాశ్చ పరధర్మే ష్వవస్థితాః, తేషాం శాంతికరో రాజా స్వర్గలోకే॥ హీ మయతే, పరధర్మో భవే త్త్యాజ్య స్సురూపః పరదారవత్ ॥ తమతమవర్ణములకుఁ జెప్పఁబడిన ధర్మములవదలి యెవ రితరధర్మముల నాశ్రయింతురో వారిని బ్రభువు శిక్షించఁదగినదనియు నాలాటిప్రభువు స్వర్గఫలమును బొందుననియుఁ దనభార్యకన్నఁ బాలసౌందర్యముకలదైనను బరునిభార్య తన కెటుల గ్రహించఁదగనిదో యటులనే తనవర్ణధర్మములకన్న నితరవర్ణధర్మములు మంచివిగానున్నను దాను గ్రహించఁగూడదనియు నీశ్లోకముల యభిప్రాయము. గీతలయందు శ్రీకృష్ణపరమాత్మ గూడ నిటులఁ జెప్పియున్నాఁడు. శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్, స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥ కొన్నిగుణములచేతఁ దక్కువైనను స్వధర్మాచరణ మంచిదనియుఁ బరధర్మానుష్ఠానము భయంకరమైనదికనుక నాచరించఁగూడదనియు నేతచ్ఛ్లోకాభిప్రాయము గానఁ బరధర్మానుష్ఠానము మంచిది కాదు. ప్రతివర్ణమువారును దమధర్మానుష్ఠానము చక్కఁగాఁ జేసినయెడల నుత్తమఫలమును బొందుదురు. పరధర్మానుష్ఠానమువలన ఫలము లేకపోవుటయేకాక యనేకముగాఁ బాపఫల మనుభవింపవలసియుండును. అత్రిస్మృతి. శ్లో॥ ఆత్మీయేసంస్థితో ధర్మే శూద్రోఽపి స్వర్గమశ్నుతే॥ శాస్త్రముచేఁదనకుఁ జెప్పఁబడినధర్మమందు శ్రద్ధగలిగియున్నయెడల శూద్రుఁడుగూడ స్వర్గఫలమును బొందునని యీ యత్రిస్మృతి చెప్పుచున్నది. మహాతేజోవంతుఁడగు బ్రహ్మ సర్వలోకసంరక్షణార్థ

అను ముఖబాహూరుపాదములనుంచిపుట్టిన బ్రాహ్మణక్షత్రియవైశ్య శూద్రులకుఁ బ్రత్యేకముగఁ గర్మముల సృజించెనని "సర్వస్యాస్యతుస ర్గస్యగుప్త్యర్థంసమహాద్యుతిః, ముఖబాహూరుపజ్జానాం పృథక్కర్మా ణ్యకల్పయు" త్తను మనుస్మృతిశ్లోకము చెప్పుచున్నది.

దీనివలన బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులు తమతమధర్మానుష్ఠా నము తప్పక చేసినయెడలఁ బరస్పరోపకారోపకారకభావముగలవారలై లోకోపకారులగుటలో సందియము లేదని తెలియుచున్నది "లోకా నాంతు వివృద్ధ్యర్థం ముఖబాహూరుపాదతః, బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం శూద్రంచ వినివర్తయ" త్తను శ్లోకముచే మనువు లోకాభివృద్ధి కొఱకు ముఖబాహూరు పాదములనుంచి బ్రాహ్మణక్షత్రియవైశ్యశూ ద్రులను బ్రహ్మ సృష్టించినాఁడని చెప్పియున్నాఁడు. బ్రాహ్మణులు ముఖ మునుంచి సృష్టింపఁబడుటవలన జ్ఞానప్రధానులని తెలియుచున్నది. జ్ఞానేం ద్రియములగు త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వ ఘ్రాణములు ముఖమునందే కదా యుండును. ముఖస్థానము జ్ఞానప్రధానమగుట వలన ముఖమునుంచి సృజించఁబడిన బ్రాహ్మణులు జ్ఞాన ప్రధానులగుదురుగాన బ్రాహ్మణులు మనుష్యజాతికి ముఖస్థానీయులై సకలవేదశాస్త్రసంపన్నులై యాయా జాతికిఁ దగినరీతిగా జ్ఞానోపదేశముచేయుచు దమకన్నఁ దక్కువవారగు క్షత్రియులవలనఁ బరిపాలనమును వైశ్యులవలన దానపూర్వకముగా ధన మును శూద్రులవలనఁ దమకుఁ దగినయుపచారములను బొందుచు లో కాభివృద్ధి కనుకూలురగుచున్నారనియు క్షత్రియులు బాహువులవలన సృష్టింపఁబడుటవలన బలప్రధానులనియుఁ దెలియుచున్నది. శరీరమంతటి లోను బలముగలవి బాహువులే. బాహువులు లేనియెడల శరీరమెంతబల వత్తరమైనను నేమియుఁ జేయలేదు. ఇతరులవలన నేలాంటిబాధయుఁ గలుగకుండఁ బలముగలిగి బాహువులు శరీరము నెట్టులఁగాపాడునో యట్టులనే శరీరరూపమగు మనుష్యజాతికి బాహుస్థానీయులైన క్షత్రి

యులు వేదశాస్త్రసంపన్నులై తమకుఁ బైదియగు బ్రాహ్మణజాతిని దక్కువగు వైశ్యశూద్ర జాతులను తమజాతివారిని నేవిధమైన బాధలు లేకుండఁ బరిపాలనచేయుచుఁ బై బ్రాహ్మణుల వలనఁ గర్మానుష్ఠాన జ్ఞానోపదేశములను బొందుచుఁ దక్కువజాతి వారగు వైశ్యులవలనఁ బన్నుమూలముగా ధనమును సమ్మానములవలన రాజ్యాంగరక్షణత్వాద్యుపకారములను బొందుచు లోకాభివృద్ధిని జేయుదురు.

వైశ్యులు బ్రహ్మయొక్క యూరువులనుంచి సృజింపఁబడుటవలనఁ గర్మనిష్ఠులై సర్వజాతిజీవనాధారమైన ధనసంపాదకులుగాను గృషివాణిజ్యాది వృత్తులుగలవారలై తొడలు లేనిది శరీర మెటుల ధరించుటకు వీలుగానుండదో ధనసంపాదకము నూరుస్థానీయమునగు తమజాతి లేనిది శరీరస్థానీయమగు మనుష్యజాతి నిర్వహించుట దుర్లభముగానఁ దమకన్న నెక్కుడయగు బ్రాహ్మణులకు దానపూర్వముగాను క్షత్రియులకుఁ బన్నుమూలకముగాను ధనము నుపకరించి బ్రాహ్మణులవలన స్వధర్మజ్ఞానోపదేశమును క్షత్రియులవలనఁ బరిపాలనమును బొందుచుఁ దమకన్నఁ గ్రిందిజాతివారగు శూద్రులను దమకుండు గోరక్షణవాణిజ్యాదులయం దుపయోగపెట్టుకొని యందుకుఁగాను వారికి సంరక్షణార్థము ధనమిచ్చుచు లోకాభివృద్ధిచేయుదురు. శూద్రులు పైమూఁడు జాతులవారికిఁ దగినపరిచర్యలుచేయుచు బ్రాహ్మణులవలన స్వధర్మజ్ఞానములును క్షత్రియులవలనఁ బరిపాలనమును వైశ్యులవలన ధనమును బొందుదురు. ఈ శూద్రులు బ్రహ్మయొక్క పాదములనుంచి సృజింపఁబడిరి. అందువలన శరీరముకుఁ బాదములు లేనియెడల నేవిధమైన సంచారము నెటులజరుగదో యటులనే పాదస్థానీయులగు నీజాతివారివలన శరీరస్థానీయమగు మనుష్యజాతిసంచరించుచున్నది. కావున శరీరమును బాదము లెటుల నుపచరించుచు గమనాగమనములకు సహాయములగుచున్నవో యటులనే మనుష్యజాతి కుపకరించుచు నధిక

సహాయమును జేయుచు లోకాభివృద్ధికి శూద్రు లుపయోగించుచు న్నారు. ఈరీతిగాఁ బరస్పరము నన్ని జాతులవారు నీలోకమం దుపకారోపకారక భావముగలవారై సద్గతినిజెంది సుఖింతురని మనువుచెప్పిన శ్లోకము యొక్క యభిప్రాయముగాన నాయాజాతివారు తమకు శాస్త్రముచే నిరూపింపఁబడిన ధర్మమునుదప్పి యితరధర్మముల నాశ్రయించకుండ నుండినయెడల నిహపరశ్రేయస్సులఁ బొందుటలో సందియము లేదు. ఆయాజాతికి ధర్మములు మనుధర్మశాస్త్రమందుఁ జెప్పఁబడినవి.

శ్లో॥ అధ్యాపనం చాధ్యయనం యజనం యాజనం తథా, దానం ప్రతిగ్రహంచైవ బ్రాహ్మణానా మకల్పయత్॥ ప్రజానాం రక్షణం దాన మిజ్యాధ్యయన మేవచ, విషయే ష్వప్రసక్తిశ్చ క్షత్రియస్య సమాసతః॥ పశూనాంపాలనం దాన మిజ్యాధ్యయనమేవచ, వణిక్పథం కుసీదంచ వైశ్యస్య కృషిమేవచ॥ ఏకమేవతుశూద్రస్య ప్రభుఃకర్మ సమాదిశత్, ఏతేషామేవవర్ణానాం శుశ్రూషా మనసూయయా॥ బ్రహ్మదేవుఁడు వేద శాస్త్రాధ్యయనముచేయుట యితరులచేఁ జేయించుట శ్రౌతస్మార్తాదికర్మములుచేయుట యితరులచే జేయించుట దానముచేయుట స్వీకరించుట యను నీయాఱుధర్మములు బ్రాహ్మణులకు గల్పించెను. ప్రజాపరిపాలనము దానముచేయుట వేదాధ్యయనము శ్రౌతస్మార్తకర్మాచరణము విషయాసక్తిలేకుండుట యను నివి క్షత్రియులకుఁ గల్పించెను. పశురక్షణమును దానమును వేదాధ్యయనమును శ్రౌతస్మార్తకర్మానుష్ఠానము క్రయవిక్రయాదివ్యాపారమును వడ్డివ్యాపారమును వైశ్యులకుఁ గల్పించెను. పైవర్ణములవారికి సేవచేయుటయే శూద్రులకుఁ గల్పించెను.

## బ్రాహ్మణధర్మము.

బ్రాహ్మణుఁడు పైనఁజెప్పినరీతిగా వేదశాస్త్రసంపన్నుఁడై శ్రౌతస్మార్తాదికర్మములను జక్కఁగా నాచరించి యితరులచే వేదాధ్యయనాదులును శ్రౌతస్మార్తాదికర్మములును జేయించుచు దానప్రతిగ్రహములు

గలవాఁడై బ్రహ్మవిద్యాపరుఁడై ధనార్జనపరుఁడుగాక యుండుట యుత్తమ ధర్మము. ఈధర్మముల మానుకొనిన యన్యవ్యాపారాసక్తునకుఁ బరమార్థభంగము గలుగును. బ్రాహ్మణునకు వేదశాస్త్రాధ్యయనము ప్రధానమైనది. అన్ని వేదములకు జదువ లేకున్నను స్వశాఖీయ వేదాధ్యయనమైనను జేయఁదగును. "ఏకాం శాఖా మధీత్య శ్రోత్రియోభవతి" యను శ్రుతి యేకశాఖాధ్యయనమువలనను శ్రోత్రియుఁడగునని చెప్పుచున్నది. అధమపక్షము కొంచెమైనను వేదాధ్యయనముచేసి ధర్మశాస్త్రాదిగ్రంథములును మతగ్రంథములును పఠ్యసించి స్వమతాచారవిరుద్ధపరుఁడు గాకయుండునది. వేదాధ్యయనముచేయని యితరాసక్తునకు బ్రాహ్మణ్యముండదని శాస్త్రము చెప్పుచున్నది.

వసిష్ఠస్మృతి. శ్లో॥ యోఽనధీత్య ద్విజో వేదా నన్యత్ర కురుతే శ్రమం, సజీవన్నేవ శూద్రత్వ మాశుగచ్ఛతి సాన్వయః॥ వేదాధ్యయనము చేయక యే బ్రాహ్మణుఁ డితరవ్యాసంగము చేయునో యాబ్రాహ్మణుఁ డీజన్మమందే శూద్రత్వమును బొందును. వేదమునందు నాలుగుజాతుల వారిధర్మములును శ్రౌతాదికర్మవిధానమును సర్వమును గలదుగాన నా వేదములఁ జక్కఁగా నధ్యయనముచేసిన యెడల స్వవర్ణ ధర్మానుష్ఠానమందు శ్రద్ధగలిగి యితరవర్ణ ధర్మపరుఁడుగాక యిహపరసౌఖ్యముల బొందును. అట్లుగాక యితరవ్యాసంగము గలవాఁడైనయెడల వర్ణాశ్రమధర్మములు తెలియక వికల్పబుద్ధిగలవాఁడై వేదశాస్త్రాదిధర్మములందు శ్రద్ధలేనివాఁడై నిషిద్ధాచారపరుఁడై యిహపరశ్రేయస్సులకు దూరమగు. ఇక్కాలమున మనవారు కొందఱు బొత్తిగా వేదశాస్త్రాధ్యయనాదుల మానుకొని శాస్త్రనిషిద్ధమగు నన్యభాషావిద్యాదులయందాసక్తిగలవారలై స్వవర్ణాశ్రమవిరుద్ధధర్మము లాచరించుచు నిట్లాచరించుటయే గొప్పయని విఱ్ఱవీఁగుచున్నవారు. ఇట్లగుటకు వేదశాస్త్రాధ్యయనాదులు చేయక స్వకులాచారములఁ జక్కఁగాఁ దెలిసి

తత్రాప్యశక్తః కరణే సదాచారపరో భవేత్॥ బ్రాహ్మణాధములు - కాల
వైపరీత్యమువలన శ్రౌతకర్మానుష్ఠానము చేయలేనియెడల స్మార్తకర్మాను
ష్ఠానమైనను జేయందగినది. స్నానసంధ్యావందనాది వైశ్వదేవాంతకర్మా
నుష్ఠానము సులభసాధ్యమైయుండునుగాన నంతవఱకైనను జేయందగినది. అది
యును శక్తిలేనియెడలఁ గులధర్మములగు సదాచారములైనను నాచర
ణలో నుంచుకొనందగినది. శ్లో॥ యస్మిన్దేశే యదాచారః పారంపర్య
క్రమాగతః। వర్ణానాం సాంతరాళానాం స సదాచార ఉచ్యతే। ఏదేశ
మందే యే జాతివారికిఁ గులాచారము లనాదికాలమునుండి మొదలు
కొని యేక్రమముగానున్నదో యాయాదేశస్థులగు నాయావర్ణములవా
రాయా యాచారములుగలిగియుండుటయే సదాచారము. మనము
మనయాచారముల విడిచి యన్యదేశాచారములు గలవారలముగాఁ
గూడదు. అట్లైనయెడల నాచారభ్రష్టులని యనిపించుకొందుము.
ఆచారములు తప్పినవెంటనే పురుషునకధర్మము వ్యాపించును.

శ్లో॥ సర్వేషామనుపేవర్ణానా మాచారో ధర్మపాలకః, ఆచార భ్రష్ట
దేహానాం భవేద్ధర్మః పరాఙ్ముఖః॥ సర్వజాతులవారికిని బరంపరాగతమైన
శాస్త్రీయాచారము ధర్మమును గాపాడును. ఆ యాచారము విడిచిన
వారికి ధర్మదేవత పరాఙ్ముఖమగును. అనఁగా సద్ధర్మము నశించి యధర్మ
మాశ్రయించునని యభిప్రాయము. ధర్మనాశనమైనచో జాతిసాం
కర్యముఁ దద్ద్వారమున మహారౌరవాది నరక ప్రాప్తియుఁ గల్గును.
ఇందులకుఁ బ్రమాణము భగవద్గీతా ప్రథమాధ్యాయమందుఁ గలదు.
శ్లో॥ ధర్మే నష్టే కులంకృత్స్న మధర్మోఽభిభవత్యుత॥ అధర్మాభిభవా
త్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః॥ స్త్రీషుదుష్టాసు వార్ష్ణేయ జాయతే
వర్ణసంకరః॥ సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ॥ ధర్మము నష్ట
మైనచో నధర్మము వ్యాపించును. అధర్మము వ్యాపించఁగనే కులస్త్రీలకు
దోషముగలుగును. స్త్రీలు దుష్టలగుటవలన వర్ణసంకరమగును. వర్ణసాంకర

ర్యమువలన ధర్మమువదలినవారికిని నాకులస్థులకును నరక ప్రాప్తిగలుగు నని యీశ్లోకముల యభిప్రాయముగాన ధర్మలోపములేకుండ సదాచారపరులైయుండుట మంచిది. శ్లో॥ శిఖాం పుండ్రంచ సూత్రం చ సమయాచారమేవచ, పూర్వైరాచరితం కుర్యా దన్యథా పతితో భవేత్॥ జుట్టు బొట్టు సూత్రము నితర సమయాచారములు ననగా బట్టకట్టుకొనుట మడుగుకట్టుకొని శూద్రాదిస్పర్శలేకుండుట మొదలగు నాచారములన్నియుం దమపూర్వులగు తండ్రితాతముత్తాత లేరీతినాచరించిరో యారీతి నాచరింపవలెను. వేఱువిధముగా నాచరించినయెడలం బతితులగుదురని యీశ్లోకాభిప్రాయము, ఈలాటిసదాచారములను వదలినయెడల నధర్మవ్యాప్తిగలిగి లోకమందు క్షామరోగము లధికమగును, వానివలన నిహామం దనేకబాధలును బరమందు నరకప్రాప్తియుం గలుగునుటకు సందియములేదు. ఈకాలములో మనవారు కొందఱు పైనజెప్పం బడిన స్వధర్మములను క్రమక్రమముగా విడుచుకొని యశాస్త్రీయ ధర్మాచార పరు లగు చున్నారు.

ఈయధర్మాచరణ మధికమగుటవలననే దేశమందు రోగము లధికమగుట పంటలుపండకుండుట మొదలగు బాధలు ప్రత్యక్షముగాం బ్రజ లనుభవించుచున్నారు. ధర్మముదగ్గినకొలంది క్షామరోగాదిబాధ లధికమగుచునేయుండునుగాన భారతీయులారా! మనవర్ణాశ్రమధర్మముల విడుచుట మంచి గాదు. విడుచుచున్నారాయనిన వినుండు. పైనం జెప్పంబడిన శ్రౌతకర్మములును దేవతాప్రీతికరములును నగు జ్యోతిష్టోమ చయన పౌండరీకాది క్రతువులు తఱచుగా నెచ్చటను జరుగుటయే లేదుకదా? ఆకర్మములు చేయుట కిక్కాలపువారు సమర్థులు కాక పోయినను స్నానసంధ్యావందన పంచయజ్ఞాది స్మార్తకర్మములనైనను జేయువార లరుదైరికదా? అవ్విలేకున్నను గులక్రమ ప్రాప్తములును శాస్త్రీయములును నగు జుట్టు కట్టు బొట్టు మొదలగు నిరాయాస సా

ధ్యములగు ధర్మములనుగూడ మానుకొనుచున్నారు కదా? అయితే మనవారీ ధర్మముల వదలుచున్నారా? జుట్టు పెట్టుకొనుటలేదా? పట్ట కట్టుకొనుటలేదా? బొట్టు పెట్టుకొనుటలేదా యనిన నిజము. ఈపనులు చేయుచున్నారుకాని కులాచారవిరుద్ధముగా నశాస్త్రీయముగాఁ జేయుచున్నారు. గోపాదప్రమాణాంశిఖాం. గృహస్థాశ్రమస్థులకు గోవుపాద మెంత వెడల్పుగానుండునో యంత కధికముగాకుండ జుట్టుండవలయునని శాస్త్రము చెప్పుచున్నది. ఆచారముగూడ నటులనే కలదు. ఇప్పుడు మనవా రిందుకు విరుద్ధముగా నాచరించుటలేదా? కొందఱు జుట్టు బొత్తిగా లేకుండఁ దల బోడించుకొనువారు. కొందఱు జుట్టులేకుండ బొచ్చుకత్తిరించుకొనువారు. ముందు వెనుకలఁ గత్తిరింపుజుట్టుగలవారు. ఈరీతి నెన్నెన్నో వికారములఁ బొందుచుండిరి కదా? ఈవికారములు మన కులాచారములయం దెచ్చటనైనను జూచి కాని వినికాని యున్నామా? ఇవి కులవిరుద్ధవ్యాపారము లేకదా? వీనివలన నేమి యుపయోగము గలదో విచారించుఁడు.

ఉపయోగము లేకపోఁగా బ్రాహ్మణుఁడో క్రీస్తుమతస్థుఁడో యే జాతివాఁడో తెలియకుండఁ దనజాతిధర్మములు గనఁబడకుండ నీ బొచ్చుచేఁ గప్పఁబడి చూచిన పెద్దలగువారలందఱకు స్పృశ్యత్వాదిసంబంధములలో సందేహము గలుగఁ జేయుచున్నారు. ఇటులఁ జేయుట పులినిజూచి నక్క వాఁత పెట్టుకొనెననురీతిగా విమతస్థులగు దేశాంతరీయులరీతిచూచి వారివలెనుండవలెనను నభిప్రాయముతోనా? లేక తనశరీరమునకు విశేషసౌందర్యముగలుగుననియా? చూచినవారు వీరు ప్రభువులని సంతోషించుదురనియా? మొదటిరీతి మంచిదిగాదు. దేశాంతరీయులతో సమానముగానుండిన మన కేమి లాభము? వారు మనదేశస్థులుగారు. మన మతాచారములు గలవారుకారు వారినిజూచి మన మతాచారములు మనము వదలుకొనవచ్చునా? అది చాలఁ దక్కువతనము. పాశ్చాత

ద్ధర్మములనాచరించినయెడల స్త్రీలుకూడఁ బురుషులంబోలి స్వకులాచారపరులు గాఁగలరు. గానఁ బురుషులగువారితర శ్రౌతస్మార్తాద్యధికకర్మానుష్ఠానము చేయ శక్తులుగాకున్నను స్వకులాచారప్రాప్తమగు జుట్టు బొట్టు కట్టు మొదలగుధర్మములనైనను మార్చుకొనక యథాశక్తి స్నానసంధ్యావందనాది కర్మాసక్తుఁడై యుండఁదగినది. వైదికకర్మానుష్ఠానము చేయుచుండిన నీకాలమునఁ గుటుంబపోషణ జరుగనేరదనినచో వైన నొకవిధముగా సమాధానము చెప్పుటయైనది. ఆమార్గము రుచించకున్నను మనకులాచారధర్మములకు లోపము గలుగకుండ యథాశక్తిగాఁ బైనఁ జెప్పినరీతిగా స్వధర్మపరుఁడై యితరకాలమందుఁ గుటుంబపోషణకుఁగాను రాజకీయవిద్యమొదలగు సాధనములు సంపాదించి వానివలన ధనార్జన చేసికొని స్వకులాచారపద్ధతులఁ దప్పకుండుట కేలాటిబాధయునుండదని నమ్మఁదగియున్నది. మనవారుకొంద ఱటుగాక స్వధర్మములందు హేయబుద్ధిగలవారలై పరధర్మానుష్ఠానసంధ్యావందనాద్యాచారములను మానుకొని తాముమానుటగాక కొన్నికుయుక్తులచే శ్రద్ధచే స్వకర్మానుష్ఠానపరులగు నితరులఁ బరిహసించుచుఁ బరమార్థపథము సంపాదించుకొనుచున్నారు. ఈమార్గము మంచిదికాదు. మానవశరీరముగలిగి యందులో సర్వాధికారములుగల బ్రాహ్మణజాతివాఁడై సద్గతిసాధనము స్వధర్మము ననుష్ఠించకుండిన జన్మమరణప్రవాహరూపమగు నీసంసారమున ననేకతిర్యగాది నీచజన్మములెత్తుచు ననేకఘోరవ్యాధినరకములనుభవించుచుఁ బారముగానక వ్యధలనొందుచుండును. స్వధర్మానుష్ఠానపరుఁడై శ్రమచే గుటుంబపోషణ చేసినను సద్ధర్మముగలవాఁడై సంసారములోఁ జిక్కక కృతార్థుఁడగుటకు సందియములేదు.

బ్రాహ్మణజాతివారు స్వధర్మపరులైనయెడల నితరజాతివారు తమ ధర్మములఁ దప్పరు. కనుకనే శంకరభగవత్పాదులవారు బ్రహ్మసూత్ర

భాష్యమందు "బ్రహ్మక్షత్రేహి రక్షితే సర్వంహి రక్షితంభవతి" యని
వ్రాసియున్నారు. బ్రాహ్మణక్షత్రియజాతులు ధర్మముతప్పకుండునటుల
రక్షించినయెడల సర్వము రక్షించబడునని యేతద్భాష్యాభిప్రాయము.
భగవంతుఁడు బ్రాహ్మణజాతికి ధర్మబోధనాధికారమిచ్చియున్నాఁడు.
బ్రాహ్మణజాతియే స్వధర్మమును వదలినయెడల నితరజాతులవారు నడ
లుటలో సందియమేమి? బ్రాహ్మణునికి వేదాధ్యయనము వేదాంగీ
భూత శాస్త్రాధ్యయనము ముఖ్యకర్తవ్యము. ఆ వేదశాస్త్రములు చెప్పు
రీతి ధర్మానుష్ఠానము చేయఁదగియుండును. తద్విరుద్ధధర్మములమాన
వలయును. శాస్త్రవిహితధర్మములనాయాజాతివారికుచితరీతిగా బోధించి
వారివారిధర్మములు తప్పకుండ నడచుకొనులాగునఁ జేయఁదగినది.
మన బ్రాహ్మణు లీరీతిగా నడచుకొనువెడల దేశమందు దుర్భిక్షములు
రోగపీడలునుదయించ నేరవు. ఇక్కాలమున బ్రాహ్మణులాలాటిధర్మముల
మాని జన్మాదిగా నీచవిద్య లభ్యసించి స్వధర్మములు తెలియక తదను
ష్ఠానము మానుకొని విపరీతధర్మముల నాశ్రయించుటచేతనే యీలాటి
దుర్భిక్షములు విపరీతరోగములు దేశమునందు వ్యాపించుట కవకాశము
గలిగినది. ఈరోగములకుఁగా నితరచికిత్స లెన్నిచేసినను నుపయోగము
లేదు. మఱింత యభివృద్ధియే యగుచుండును. ధర్మాభివృద్ధిగలిగినఁ దగ్గి
పోవును. ధర్మమే సర్వజగత్తును గాపాడును. ధర్మమును మనము వదల
కుండిన నేలాటిబాధయుఁ గలుగదు. కనుకనే "ధర్మో రక్షతి రక్షితః"
యని పెద్దలు చెప్పుచున్నారు. ధర్మమును మనము గాపాడిన నాధ
ర్మము మనలనందఱిని రక్షించునని దీనియభిప్రాయము. పూర్వము పాం
డవు లజ్ఞాతవాసముచేయునపుడు దుర్యోధనుఁడు వారిని గనుఁగొనలేక
భీష్ములవారివద్దకువచ్చి "పాండవులుండుతావు గనుట కుపాయముచెప్పు"
మనిన భీష్ముఁడు "పాండవులు ధర్మాత్ములు. ఎప్పుడు స్వధర్మములను వద
లువారుకారు. వారుండుతావున దుర్భిక్షరోగాదు లుండవు. ధనధాన్య

ములు విశేషముగా నుందురు. అలాటిచోటున వా రున్నారని తెలి
యుమా" యని చెప్పెను.

ఈవిషయము భారతమం దందఱుం జూచియేయుందురు. దీనివలన ధర్మమే దేశాభివృద్ధికిఁ బ్రజాసుఖమునకుఁ గారణమని తెలియుటలో సందియము లేదు కావునఁ దమధర్మములను బ్రాహ్మణులు మానకుండిన నిహపరసుఖములుగలవు. వేదాధ్యయనాదులు సమగ్రముగాఁ జేసి శ్రౌతస్మార్తాది కర్మానుష్ఠానమంతయుఁ జేయలేకున్నను గొంచెమైనను స్వశాఖీయవేదాధ్యయనము గలవాఁడై ధర్మబోధకములగు శాస్త్రములను గొంతయైనను దనకుపయోగమగునట్లైనను దెలిసికొని నిత్యము స్నాన సంధ్యావందన పంచయజ్ఞాది శుభకర్మములయందైనను నిరతుఁడై కులాచారప్రాప్తమగు విభూతిధారణ వస్త్రధారణ శిఖాధారణ మొదలగు బ్రాహ్మణచిహ్నల ధరించియుండినను మనధర్మము లంతగా క్షీణించవు. బ్రాహ్మణజాతియందుఁ బుట్టినవారి కన్నికర్మములలోను సంధ్యావందనకర్మ మతిముఖ్యమైనది, ఆసంధ్యావందనముచేయని వారిని బ్రాహ్మణులని జెప్పఁదగదు కావున నాసంధ్యావందనకర్మమందు బద్ధాదరులై యుండుట చాల శ్రేయస్కరము. సదాచారపద్ధతులఁ జక్కఁగాఁ దెలిసికొనుట బ్రాహ్మణులకు ముఖ్యమైనది. సదాచారము తత్తద్దేశాచారానుసారముగా నుండవలయును. శ్లో॥ యస్మిన్ దేశే యదాచారః పారంపర్యక్రమాగతః, వర్ణానాం సాంతరాళానాం స సదాచార ఉచ్యతే॥ ఏదేశమం దేలాటియాచారము పారంపర్యక్రమముగాఁ బెద్దలగు వారిచే నాచరింపఁబడుచున్నదో యాదేశమం దాయాచారమే సదాచారమని జెప్పఁబడునని యీశ్లోకాభిప్రాయమని వెనుక వ్రాయఁబడినది. దేశభేదముచే నాచారభేదములు కొన్నిగలవు. ఒకదేశపుటాచారము మఱియొకదేశమందుండువా రాచరించక శాస్త్రవిరుద్ధముగాక పెద్దల కాలమునుంచి కలిగియుండు తమదేశీయాచారము గలిగియుండుట మంచి

ది. ఆయాచారపద్ధతి తెలిసికొనుట యావశ్యకముగాన సంగ్రహముగాఁ ప్రతిదినమును మనమాచరింపఁదగిన ముఖ్యధర్మములుకొన్ని యిచట నిరూపింపఁబడుచున్నవి.

ప్రతిదివసమందును మనము సూర్యోదయమునకు ముందుగా నాలుఁగుగడియల ప్రొద్దుండఁగా నిద్ర వదలవలెను. సూర్యోదయమునకు ముందు బ్రాహ్మముహూర్తమనియు రౌద్రముహూర్తమనియు రెండు కాలములుగలవు. వానిలో మొదటిది బ్రాహ్మముహూర్తము. అనఁగా బ్రహ్మదేవతాక కాలము. రెండవది రౌద్రముహూర్తము. అనఁగా రుద్ర దేవతాక కాలము. ఈ కాలములందు నిద్రించుట మంచిదికాదు. శౌనకః శ్లో॥ బ్రాహ్మేముహూర్తేచోత్థాయచింతయేదాత్మనోహితం, గురుంవిష్ణుం నమస్కృత్యమాతాపితౄంస్తథైవచ॥ యదిచ్ఛేదాత్మనస్సిద్ధిం యమస్యాదర్శనంతథా। సతతం తేనకర్తవ్యో బ్రాహ్మకాలే ప్రజాగరః॥ బ్రాహ్మేముహూర్తే సేవేతాం శయనంయత్రదంపతీ, శ్మశానతుల్యంతద్వేశ్మపితృభిఃపరివర్జ్యతే॥ ప్రత్యూషకాలే నిద్రాంచ కురుతే సర్వదాతుయః, అశుచింతంవిజానీయా దనర్హస్సర్వకర్మసు॥ బ్రాహ్మేముహూర్తే యానిద్రా సాపుణ్యక్షయకారిణీ, తాంకరోతితుయోమోహాత్పాదకృచ్ఛ్రేణశుధ్యతి॥ ఇత్యాది స్మృతివాక్యములు జనుఁడు బ్రాహ్మముహూర్తమందునిద్ర లేచినవాఁడై తనహితమును చింతించి గురువునకు విష్ణువునకుఁ దల్లిదండ్రులకు నమస్కరించవలయుననియు యమునిబాధవద్దని కోరువాఁడును నాత్మసిద్ధినిగోరువాఁడును నెవ్వఁడును బ్రాహ్మముహూర్తమున శయనింపఁగూడదనియు బ్రాహ్మముహూర్తమునందు దంపతులు శయనించిన యెడల వారు శయనించిన గృహము శ్మశానసమమనియు నచ్చటికి పితృదేవతలెప్పుడును రారనియు నాకాలమందు నిద్రించువాఁడు సర్వదా యపరిశుద్ధుఁడనియుఁ గర్మములాచరించుటకు నర్హుఁడుగాఁడనియు బ్రాహ్మముహూర్తమందు నిద్రించిన నిదివఱకుఁ జేసిన పుణ్యమంతయు నశించునని

యు నందునుఁ బాదకృఛ్రము ప్రాయశ్చిత్తమనియుఁ దెలుపుచున్నవి. ఇందువలన బ్రాహ్మముహూర్తమున నిద్రించఁగూడదని సిద్ధమైనది. ఈనియమము స్త్రీ పురుషాది బ్రాహ్మణాది సమస్తజనులకుఁ గలదు. ఈకాలమందీశ్వరధ్యానాదులు చేయఁదగినది. శ్లో॥ మహాభారత మాఖ్యానం క్షితిం గాంచ సరస్వతీం, బ్రాహ్మణాం కేశవంచైవప్రాతరుత్థాయ కీర్తయేత్॥ భారతకథను భూమిని గోవును సరస్వతీదేవిని బ్రాహ్మణులను స్మరించఁదగినది.

మఱియు, వారివారి శక్త్యనుసారముగా నిష్టదేవతాప్రార్థనాదులు చేయఁదగినది. తరువాత సర్వాధారమగు భూమిని ప్రార్థింపవలెను. శ్లో॥ సముద్రవసనే! దేవి! పర్వత స్తనమండితే। విష్ణుపత్ని! నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వమే॥ సముద్రములను వస్త్రమును ధరించినట్టియుఁ బర్వతములను స్తనములచే నలంకరింపఁబడినట్టియు విష్ణుభార్యయు నైనయో పృథివిదేవీ! నీకు నమస్కరించుచున్నాను. నీయందు నేను జేయుఁబోవు పాదస్పర్శను క్షమించుమాయని యేతచ్ఛ్లోకార్థము. ఈశ్లోకమును ప్రతిమనుజుఁడు నిద్రలేచి భూమిమీఁదఁ బాదస్పర్శ చేయక పూర్వము చదువఁదగియున్నది. దీనివలనఁ బృథివ్యభిమానదేవత మనయందు దయగలదై తనయందుఁ బాదములనుంచి సంచరించినను నాగ్రహమువదలి కాపాడును. ఈశ్లోకముచేఁ బ్రార్థించక బాదస్పర్శ చేసిన యెడలఁ బృథివీదేవి మనయందుఁ గోపముగలదై మన కననుకూలమగు సంచారము గలుగకుండఁ జేయునుగానఁ బ్రతిమానవుఁడుఁ బ్రాతఃకాలమందుఁ బృథివీధ్యానపూర్వకముగాఁ బాదస్పర్శక్షమాపణ కోరవలసియున్నది. పృథివి జడము గదా! మనము పాదస్పర్శ చేసినందువలనఁ గోపముగాని ప్రార్థనవలన ననుగ్రహముగాని యెటులఁగలుగుననిన నిజము. పృథివి జడయే కాని వాస్తవముగా జడమైన మనశరీరములోపలనుండు జీవుని కెటుల నభిమానముగలదో యటులనే జడమగు పృథివి కభిమాన

## [illegible]

---

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు.

2 రాజా శ్రీ వెల్లపురవల వెంకటరాఘవేంద్రరావు బహద్దూర్, జాగీరుదారుగారు, శహాబు పేట.

3 బాలరాజా పరాంకుశరావు దేశముఖుగారు, యాశవరం

## ఈ నెల సొమ్ము చెల్లించిన చందాదారులు

---

౧ భువనగిరి సోమయాజులుగారు, డిస్ట్రిక్టు మున్సిబ్ కోర్టు ప్లీడరు, గుంటూరు.

౨ గోవిందరాజుల శ్రీనివాసరావుగారు, జిల్లాకోర్టు ప్లీడరు, గుంటూరు.

౩ మల్లాది పున్నయ్యగారు, నర్సరావుపేట.

౪ చాగినాటి వెంకటరత్నశాస్త్రిగారు, బెజవాడ.

౫ చంద్రగిరి రాఘవయ్యగారు, పిడుగురాళ్ల.

౬ దంతాలరాజు లక్ష్మీనరసింహముగారు, పిడుగురాళ్ల.

౭ పెంటపర్తి రాజిరెడ్డిగారు, నాళాపురం

౮ పేరూరు రాజలింగముగారు, నాయుడు, చందాయపేట.

౯ దంటు లక్ష్మీకాంతరావుగారు, సుద్దపల్లి.

---

# అభినవసరస్వతి

## పత్రికాధిపతి :—జానపాటి పట్టాభిరామశాస్త్రి

ఈ 'రౌప్యకమాసపత్రిక', ఇంగ్లీషు ప్రాచీన నవీనాంధ్రప్రబంధములును తాత్కాలికవృత్తాంతములును విమర్శనములును విద్యావిషయిక వాతవిషయికవ్యాసములును ప్రకటింపబడును. ప్రాజ్ఞజనసమ్మతములగు తాత్కాలిక వ్యాసములవలనగలుగు నానందముగాక చందాదారులకు కొన్ని గ్రంథములుకూడ నలవడును. చందా సం॥ 1కి రు 6-0-0

### ఈ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | అళ్లయాచార్యవిజయము | ... | 0 | 4 | 0 |
| 2 | కరిణీకోద్ధారిణి [పూరె వీరభద్రకవి] | ... | 0 | 4 | 0 |
| 3 | వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 4 | కంసవధ నాటకము | ... | 0 | 8 | 0 |
| 5 | చమత్కారమంజరి [సింహాద్రి వెంకటాచార్యులు] | | 0 | 4 | 0 |
| 6 | విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 7 | నీతిగీతులు [సుమతిశతకమునకు సంస్కృతము] | | 0 | 2 | 0 |
| 8 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 9 | విగ్రహారాధనఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 10 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము [పత్రికాధిపతి] | | 0 | 4 | 0 |
| 11 | సంగదోషము | ... | 0 | 8 | 0 |
| 12 | గురిగింజ | | 0 | 1 | 0 |
| 13 | పులిందావివాహము [పత్రికాధిపతి] | | 0 | 4 | 0 |
| 14 | వత్సలనీతిశతకము | ... | 0 | 1 | 0 |
| 15 | శివానందలహరి [తంగెడ రామకృష్ణకవి] | | 0 | 4 | 0 |
| 16 | లక్ష్మీవిలాసము [రాయసము వెంకటపతి] | | 0 | 4 | 0 |
| 17 | నర్సారావుపేట శతావధానము [తిరుపతివెంకటీయము] | | 0 | 8 | 0 |
| 18 | పశ్యంపశ్యం | ,, | 0 | 2 | 0 |
| 19 | పశ్యశబ్దవిచారము | ,, | 0 | 2 | 0 |
| 20 | పురశ్చరణము | ,, | 0 | 2 | 0 |
| 21 | శంతనురాజచరిత్ర | .. | 0 | 11 | 0 |
| 22 | రజస్వలావివాహఖండనము | ... | 0 | 6 | 0 |
| 23 | వర్ణవ్యవస్థ | ... | 0 | 4 | 0 |
| 24 | స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 25 | శుద్ధాంధ్రహరిశ్చంద్రచరిత్రము | ... | 0 | 10 | 0 |
| 26 | తిరుపతివెంకటేశ్వరతత్త్వము | ... | 0 | 1 | 0 |
| 27 | నూతనసంహిత-ఆంధ్రము | ... | 2 | 0 | 0 |
| 28 | స్కాందమహాపురాణాంతర్గత నాగరఖండము - ప్రథమ ద్వితీయాశ్వాసములు | ... ... | 1 | 0 | 0 |

అభినవసరస్వతీ కార్యస్థానము,

జానపాడు, పిడుగురాళ్ల పోస్టు,

గుంటూరుజిల్లా.